*Approved by the Madras Text Book Committee for class use*
*Nondetailed Study—IV, V & VI Forms*

# చంద్రాభ్యుదయము

BY
R. L. N. SOMAYAJULU, M. A.,




ప్రకాశకులు
ఎ. ఎన్. వేంకటేశ్వర్ అండ్ బ్రదర్స్
మద్రాసు

 1950 [వెల రు. 1-0-0

AAL02B 168

1

# చంద్రాభ్యుదయము

H:-72

W:-4.9

## చంద్రోదయము

మగధదేశమునకు నాఁడును నేఁడును పాటలీపుత్రమే రాజధాని. కుసుమపురి యనియు దానికి నామాంతరము. చంద్రవంశజుఁడగు సర్వార్థసిద్ధి ఆ పురమును జక్కఁగాఁ బాలించుచుండెను. అతని యమాత్యులలో మిక్కుటమగు స్వామిభక్తి గలిగి పేరెన్నిక గన్నవాఁడు రాక్షసుఁడు. సర్వార్థసిద్ధి కిరువురు భార్యలు. సునందాదేవి పట్టమహిషి; మురశూద్రస్త్రీ.

రాక్షసుని బుద్ధిబలమున ననేకరాజులు సామంతులయిరి. కోశాగార మెంతయో వృద్ధిపొందినది; కాని రాజున కొక్కటే చింత- పుత్రులు లేమి.

ఆ రాజు నదృష్టఫలమోయనునట్లు మునీశ్వరుఁడొక్కరుఁడు రాజసందర్శనార్థ మరుదెంచెను. భార్యలతోఁ గలిసి రాజాతని కాళ్లు గడిగి యుచితవిధిని బూజించెను. ముని పాదోదకమును రాజు భార్యల శిరములపైఁ జల్లెను. సునంద తలపైఁ దొమ్మిదిబిందువులు పడినవి కాని డిగఁజారిపోయినవి. మురతలపైఁబడిన యొక్కబిందువును స్థిరముగ నామెతలపై నిలిచియుండెను. ఈ విచిత్రమున కర్థమేమని రాజు ముని నడిగెను. ముని యిట్లు చెప్పెను.

"రాజా! ఎన్నిబిందువులు తలపై నిలిచినవో అందఱు పుత్రు లీవనితలకు కలుగుదురు. నే నింక యాలసింపరాదు" అని చెప్పుచు నే యటనుండి వెడలిపోయెను. రాజుభార్యలు గర్భవతులయిరి. నెలలు నిండినవి. మురకొక పుత్త్రుఁడు పుట్టెను. మురకు పుట్టినవాఁడు గనుక శిశువునకు మౌర్యుఁడని పేరిడిరి. శుక్లపక్షచంద్రునివలె నా శిశువు పెరుగుచుండెను. కాని సునంద యింకను కనలేదు. రాజు ఏమాయని చింతించెను. ఇట్లుండఁగాఁ గొంతకాలమునకు సునందకు, నొక మాంసపిండము పుట్టినది. దానిని తైలపాత్రమున రక్షింపఁగా నందుండి తొమ్మండ్రు శిశువు లుప్పతిల్లిరి. రాజు వారికి నందులని పేరుపెట్టెను.

మౌర్యుఁడు పెద్దవాఁడయ్యెను. బలిష్ఠుఁడగు నతనికి రాజు పెక్కురు కన్యకలను దెచ్చి పెండ్లిచేసెను. మౌర్యుఁడు క్షత్త్రియుఁడు కాఁడను కారణమున రాజ్యాధికారము రాలేదు. కాని, సేనాధిపత్యము లభించినది. ఆతఁడు తన తండ్రికి, రాక్షసాదిమంత్రులకు, భ్రాతలగు నవనందులకు బ్రీతిపాత్రమై వర్తించుచుండెను. నందుల విద్యాభ్యాసాదికము రాక్షసుఁడు జరిగించెను. వారును యుక్తవయస్కులైరి. పెండ్లిండ్లునైనవి. మౌర్యునకు బహుభార్యలయందు నూర్గురు పుత్త్రులుదయించిరి. వారిలో చంద్రగుప్తుఁడు కనిష్ఠుఁడు.

రాక్షసుఁడు, నందుల కాయుధవిద్యఁగూడ నేర్పుచుండెను. పుత్రులు యోగ్యులని గ్రహించి రాజు వారిలో జ్యేష్ఠుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. మిగిలినవారి నందఱను జ్యేష్ఠానువర్తులుగా నుండుఁడని యుపదేశించెను.

రాక్షసుని వీరందఱకు మంత్రిగా నేర్పాటుచేసెను. నందులకు రాక్షసునియందు సంపూర్ణ విశ్వాస మేర్పడెను.

---

## చంద్రగ్రహణము

సర్వార్థసిద్ధి దృష్టి పరలోకమువైపు తిరిగెను. మౌర్యుఁడు తన కుమారులగు చంద్రగుప్తాదులకు సకల విద్యలు నేర్పుచుండెను. నందులకు వారి నిపుణత్వమునకుఁ గన్నుగుట్టెను. ఏనాఁడైనను దమకు వారు సీళ్లుత్రోడుదు రేమోయని జడిసిరి. ముందే వారిని ద్రుంచివేయుద మని తలంచిరి. రాక్షసామాత్యునికిఁ దమ దురాలోచనమును దెలిపిరి.

బుద్ధిమంతుఁడగు రాక్షసుఁడు, దూరమాలోచించెను. లోకాపవాదము, నితర శత్రుభయమును వచ్చునని యాతఁడు వీరితో నట్టి యూహ మానుఁ డనెను. వృద్ధరాజు మొగము చూచియైన నట్లు దలంపకుఁ డనికూడ చెప్పెను.

ఆ మంచిమాటలు నందుల చెవి కెక్కలేదు. వారి కుట్రలు వారు పన్నుచునే యుండిరి. తమ పన్నుగడను మాత్రము బయలుపఱపవలదని వారు రాక్షసుని వేఁడికొనిరి. ఇట్టి పరిస్థితులలో రాక్షసుఁ డచటనుండి తప్పుకొనుటే మే లనుకొనుచుండెను.

నందరాజ్యమున దారువర్మయను విశ్వాసపాత్రుఁడగు శిల్పి యొకఁడు కలఁడు. నందు లాతనిచేత నగరమునకు

వెలుపలనున్న తోఁటలో నొకభవనమును, దానిక్రింద నొక పాతాళగృహమును నిర్మింపఁ జేసిరి. పాతాళగృహమున నప్పుడప్పుడు రహస్యాలోచనములు జరుగుచుండినవి. అంతెట్టి ఘోరకృత్యములుకూడ సంభవింపఁగలవో!

మౌర్యుఁడును నందులయందు విశ్వాసముఁ బ్రీతియు గలవాఁడు గనుక ఎన్నోసార్లు సపుత్రుఁడై యా పాతాళ గృహమున జరుగు రాజకార్యములలోఁ బాల్గొనెను. రహస్యములు బయలుపడకుండునట్టి యనువైన తావని యాతఁడు తలఁచెను.

వృద్ధరాజొకఁడు తమ యత్నమున కాటంకమని దుష్టులగు నందులకుఁ దోఁచెను. పౌరాణికులచే నాయనకుఁ దీర్ఘయాత్రాభిలాష పుట్టించిరి. తానుకూడ వెంటవత్తునని యమాత్యరాక్షసుఁ డనెను. సపరివారముగ సామగ్రితో రాజు యాత్రాపరుఁడయ్యెను. నవనందు లక్ష్యతీరిన దనుకొనిరి.

ఇఁక కాలము పోనీయరాదు. మౌర్యుని నాతని నూర్వురు పుత్రులను దమతో వేఁటకు రావలయు నని నవనందులు కోరిరి. వారు నూకొట్టిరి. వారి కెట్టి శంకయు కలుగలేదు.

అందఱును గొంతసేపు వేఁటాడి తిరిగివచ్చిరి. స్నానాదు లయినవి. ఇఁక భోజనములు కావలయును. నందులు మౌర్యులతో "మీకు దిగువయింటిలో నేర్పాటు చేసితి" మనిరి. అంత మౌర్యులు పాతాళగృహములో దిగిరి. వెంటనే తలుపులు మూఁతవడెను. సాయుధపాణులగు భటు

లచటఁ గావలియుండిరి. శత్రువు లిఁక సశింతురని నందులు సంబరపడుచుండిరి.

ఎన్నాళ్లని మౌర్యులు చెఱసాలలో నన్నము నీళ్లు లేక యుండఁగలరు? క్రమముగ వారు మృత్యుదేవత కాహార మగుచుండిరి. మౌర్యులందఱు మరణించిరని భటులు వాకిట ననుకొనుచుండఁగా, లోన జీవించియున్న చంద్రగుప్తుఁడు వినెను. కిటికీద్వారమునుండి యాతఁడు కావలివారితో నిట్లనెను. "అయ్యలారా! నేనును బ్రదుకస్థితిలో లేను. ఇచట శవదుర్గంధము పడలేను. మీకు పుణ్యముండును. నన్నిచటినుండి మఱియొకచోటికిఁ గొనిపొండు." భటుల మనసు మెత్తపడినది. పైగా దుర్వాసన బయటకుఁగూడ గొట్టుచున్నది. నందులుచేసినకుట్ర లోకమునకు దెలియును. కాఁబట్టి చంద్రగుప్తుని మఱొకచోటఁ జేర్చి, కారాగార మున కగ్గిపెట్టుదమని వారు నందులతోఁ జెప్పిరి. వారును సందుల కంగీకరించిరి. చంద్రగుప్తుఁడు 'హరీ' యనఁగానే తమకు దెలుపవలసినదిగా నందులు భటుల కాజ్ఞాపించిరి.

వారు చంద్రగుప్తుని మఱొకచోటికి జేర్చి కారా గారమునకు నిప్పంటించిరి. ఏకారణముననో చెఱసాలకు నిప్పంటుకొన్నదని లోకు లనుకొనిరి. నేరమును దాఁచివేయు టకై నందులు ఒకపన్నాగము పన్నిరి. తీర్థయాత్రలు చేయుచుఁ బ్రయాగలోనున్న తండ్రికి జాబువ్రాసిరి. ఏమన:-

"మీరు వెళ్లిన మఱునాఁడే మౌర్యులు తప్పత్రాగి వేఁటకై పోయి నగరముబయటి భవనములోనికి వెళ్లిరి. ఒకరితోనొక రొడలు తెలియక కలహించిరి. దూలముల

కట్టుత్రాళ్లు విప్పగా నాభవనము కూలినది. చంద్రగుప్తుఁ డెట్లో బ్రదికి బయటపడెను. మిగిలిన వా రందఱును ప్రాణములు విడిచిరి. ఇట్టి ఘోరవిపత్తు దైవవశమున సంభవించినందులకు మాకు చింతయు, భయమును గలుగు చున్నవి. మేమును మీ దగ్గఱకే వచ్చెదము.'' అని మఱి కొన్ని విషయములుకూడ నొకటిరెండు జతచేసి దూతలచేతి కిచ్చి పంపిరి. దూతలు రాజునొద్దకు రాగానే వారివలన పుత్రపౌత్త్రుల సంగతి నెఱింగి, మురగంగలో మునిఁగెను;

వృద్ధరాజున కుత్తర మందినది. రాక్షసుఁ డద్దానిని జదివి వినిపించెను. దాని మర్మము రాక్షసునికి దెలియును గదా! ''ఔరా! వీ రెంత పనిచేసిరి!'' అని తనలోన వెఱఁగుచెందెను. నందులకిఁక దైవబలము లేదు. ప్రజాను రాగమునుగూడ బోగొట్టుకొందురని యాతఁ డనుకొనెను.

ఈ యుత్తరమును విని రాజు కొయ్యయయ్యెను. తన కంటె ముందుగా మురగంగలోకలిసి ధన్యురాలయ్యె నని యనుకొనెను. ఏలకో రాజునకు నందులయెడల, 'వీ రేమయిన చేసిరా' యని యనుమానము పుట్టెను. అనుమానమే నిజ మగుచో కొడుకులముఖము చూడను. ఎట్లకైనను పోయి తపస్సుచేసికొందు ననుకొనెను. రాక్షసుఁడు రాజు నోదార్చు చుండెను.

రాజచ్చుటనే మార్యుల కుత్తరక్రియలు చేసెను. కొంత కాలమున కతఁడు సపరివారుఁడై తిరిగి పాటలీపుత్రము నకు వచ్చెను.

దొంగతన మెంతకాలము దాఁగును? రాజునకు యథార్థవిషయము కొంచెముకొంచెముగాఁ దెలియసాఁగెను. చంద్రగుప్తుఁడు చెఱసాలయం దుండుటయుఁ దెలియవచ్చెను. ఈ సమయమునఁ గొడుకులతోఁ గలహము పెట్టుకొనవద్దని రాక్షసుఁ డాతనితోఁ జెప్పియుండెను. తండ్రి తమ్మేమియు ననకుండుటచే నందులు గెలిచితి మనుకొనిరి. మంత్రికిని మాయచేసితిమని యనుకొనిరి.

చంద్రగ్రహణము పట్టినది. ఇంకను విడుపెప్పుడో? ఎట్లో?

---

## గ్రహణమోక్షము

మౌర్యుల మరణవార్త దేశదేశములు ప్రాఁకెను. పర్వతుఁ డను నొక రాజునకు చారు లీ వృత్తాంతమును సమగ్రముగాఁ దెలిపిరి. ఆతఁడు శబరవర్మయను తన మంత్రిని జూచి యిట్లనెను—

“మంత్రీ! నందుల దుర్మార్గాచరణము చూచితివా? తమగొయ్యి తామే త్రవ్వుకొనుచున్న ట్లున్నారు. ముసలి రాజు మన స్సెంత బాధపడుచున్నదో! రాక్షసుఁ డీ పనిలో పాల్గొనియుండునంతటి నీచుఁడగునా? ఎప్పటికైనను నందుల పాపము వారిని తిరిగి కొట్టక మానునా? ఏ దైవము చంద్రగుప్తుని బ్రదికించెనో, ఆ దైవమే చంద్రగుప్తునిచే నెంతలేసి పనులు చేయించునో యెవ రెఱుంగుదురు?”

మంత్రి యిట్లు సమాధానమిచ్చెను. "ప్రభూ! తాము నిజము పలికితిరి. ఇంక నందులకు ప్రజానురాగము తగ్గదా? అప్పుడే మౌర్యునిచే నియమింపఁబడిన భాగురాయణాది సేనాపతులకు రాజభక్తి సన్నగిల్లినది. జీవికకై మాత్రము నందుల పక్షమున నున్నారు. చంద్రగుప్తుఁడు విముక్తిపొందిన తర్వాత వా రాతనిపక్షము చేరుదురేమో? ఏమయినను మన మా రాజ్యము విషయములో నూరకయుండరాదు. అచటి విషయములు మన కెప్పటికప్పుడు తెలియుటయే గాక, అచటి మంత్రుల, భటుల, బుద్ధిని పరీక్షింపవలయును. నాకుఁ జూడఁగా నొకయుపాయము దట్టుచున్నది. ఒక కపటశిల్పమును గల్పించి వారి రాజ్యమునకు బంపి చూతము. తమ చిత్తము" అనెను. రాజును సరే యనెను.

తదనంతరము శబరవర్మ నేర్పరులగు శిల్పులచేత నొక మాయసింహమును జేయించెను. అది యొక పంజరమున బెట్టించి, నిపుణులైనవారిని దానికి కాపలిగా నేర్పాటు చేసి, వారికి కీలకములు జెల్పి పంపెను.

పంజరము పాటలీపుత్రమునకు వచ్చెను. "అభిత్వా పంజరం, సింహోద్రావ్యతాం పంజరాద్బహిః" (పంజరము తలుపులు తెఱవకుండ దానినుండి సింహమును వెలుపలికి వచ్చునట్లు చేయవలయును) అని వారు చాటిరి. అనేకులు పౌరులు గుమిగూడిరి. ఎవ్వరికిని దానిగుట్టు తెలియలేదు. రాజభటు లదిచూచి నవనందులతో నావిషయము చెప్పిరి.

నందులు మంత్రుల నది యేమియో చూచి రమ్మని యాజ్ఞాపించిరి. ఒక్క రాక్షసుఁడు దక్క మిగిలినవారు వెళ్లిరి.

వారు పోను పోయిరి; రాను వచ్చిరి. రహస్యమును కనుగొనుట వారి తరమైనదికాదు. తిరిగివచ్చి నందులయెదుట నిలువగా రాక్షసామాత్యుఁడు ప్రభువులతో నిట్లనెను.

"రాజకుమారులారా! బుద్ధిని పరీక్షించుటకై పర రాజు లెవరైన నీ కపటమును బన్నియుందురు. మనభటు లూరంతయుఁ జాటనిండు. ఎవనియం దెట్టి తెలివి తేట లున్నవో!" రాజుల యాజ్ఞచొప్పున పురమందంతటను చాటఁబడెను. చెఱసాలయందున్న చంద్రగుప్తుఁ డది వినెను. 'ఒక్కరికి నా పంజరరహస్యము దెలియ లేదా?' యని యతఁడు రాజభటులతో ననెను. చెఱసాలయందలి వాని కేక అరణ్యరోదనమయ్యెను. ఎందరో వచ్చి, చూచిరి గాని రహస్య ప్రకటన మెవ్వరికిని చేత కాలేదు.

నందులుకూడ నా పంజరమును తెప్పించి చూచిరి. వారికి నది పలుకలేదు. ఒక్కఁడును సరియైనవాఁడు దొరక లేదా? యని వారు భటులను బ్రశ్నించిరి. "స్వామీ! ఎవ్వఁడును లేఁడు. వాఁడెవ్వఁడో చెఱసాలవాకిట నిలిచి, ఈ నగరమం దాపంజర పరీక్షకుఁ డెవ్వఁడును దొరకఁ డయ్యెనా? అని ప్రశ్నించె" ననిరి.

ఆ మాటకు నందులు "వానికిఁ బంజరపరీక్ష తెలిసి యుండవచ్చును. వాఁడు రహస్యమును కనుగొన్నచో వానికి విడుపు కలుగును. రాజసమ్మానమునకుకూడ వాఁ డర్హుఁ డగును. వానిని బిలిచికొనిరండు" అనిరి. వెంటనే భటులు చెఱనుండి చంద్రగుప్తు నచటికి దెచ్చిరి. అంతలో నందు లేదో వేఱొక పనిమీఁద పోయిరి.

చంద్రగుప్తుఁ డా పంజరమువంకనే జూచుచుండెను. 'దీనిలోని సింగము తనపోషకుఁ డిచ్చు మాంసముఁ దినుచు, వాఁడు తిరిగిన వంకనే తిరుగుచున్నది' అనుకొని యతఁ డొక భటునిచే నొకమాంసపుముక్కను దెప్పించెను. దాని పోషకునివలెఁ దానును చేసాఁచి మాంసపుముక్క నందిచ్చెను. సింహము తిరిగియైనఁ జూడలేదు. 'మీసింహము నేనిచ్చు మాంస మేల తిన' దని పంజరరక్షకుల నాతఁ డడిగెను. "అయ్యా! ఇది అతిలోకమగు సింహము. ఉపాసకుఁ డిచ్చు దానిని తప్ప వేఱాహారము ముట్టదు" అని వారు బదులు చెప్పిరి.

ఇంకను జంద్రగుప్తుఁడు పరికించెను. ఆ రక్షకుఁడు దూరస్థుఁడైనపుడు ఆయాసముచేతనో యన్నట్లది మెడ వ్రేలవైచెను. చంద్రగుప్తునకు నిది బ్రతికియున్నసింగమే యని యనిపించినది. కాని యతని కింకొక యూహగూడ తట్టినది. "దీని చేష్టలు చూడఁగా యంత్రకార్యములవలె నున్నవి. పైని సింగపుచర్మము గప్పియున్న లక్క-సింహము కాదు గదా!" అనుకొనెను. అయినను జూతమని, ఒక చిన్న యేనుఁగుగున్నను దెప్పించి దాని ముందట నిలిపెను. సింగము దానిని జూచి, యెంతమాత్రము విజృంభించలేదు. దాని కన్నులలో మెఱుపే లేదు. అప్పుడది మాయసింహ మని యతనికి ననుమానము బలిసెను. దాని రక్షకుఁడు మాంసముగ్రుచ్చు కడ్డీ 'సూదంటురాయి' యనుకొనెను. కావున సింగములోపల నినుపముక్క లుండునని తేల్చుకొనెను.

చంద్రగుప్తుఁ డా రక్షకునితో కడ్డీ నవతలపెట్టి రమ్మనెను. ఆ రక్షకుఁడు చంద్రగుప్తునికి నూహతట్టుచున్నదని భయపడెను. ఎట్లయినను దప్పించవలెనని "అయ్యా! ఈ కడ్డీచివర మాంసము గ్రుచ్చిపెట్టుటే దీని కలవాటు. అలవాటు తప్పించినచో దీనికి నాహారము సయించదు" అని యేదోసాకు పలికెను. చంద్రగుప్తుని మనస్సులో నిశ్చయమేర్పడినది. ఇది యనుపకమ్ములతోఁ జేయఁబడిన లక్కసింగమని యాతఁ డనెను. సూదంటురాతికడ్డీ నెట్లాడించిన నట్లాసింగ మాడుచున్నదే కాని యిందు వేఱేమియు లేదని రహస్యమును బయటపెట్టెను. రక్షకు లోడిపోతి మని యొప్పుకొనిరి.

కాని చంద్రగుప్తుని మనస్సులో నిట్టి పంజర పరీక్ష యిపుడు జరుగుట కేమి నిమిత్తమని శంక పుట్టినది. నందులు చేసిన మౌర్యవధ, ఇతర ప్రదేశములందుకూడ పొక్కియుండవలెను. అది విని క్రోధించిన పరరాజులెవ్వరో యిట్టి పరీక్ష చేసియుందురని సూక్ష్మబుద్ధిగల చంద్రగుప్తుఁడు తలఁచెను.

కాని "యీ భావ మిట్టిదని రాక్షసునికిఁ దెలిసినచో వేగులవాండ్రని పంజర రక్షకులను దండించును." అని తా నేమియు బ్రశ్నింప దలఁచుకొనక, ఆ పంజర రక్షకుల వేషాదులనుబట్టి పార్వతీయులని నిశ్చయించుకొనెను. 'మీ దేశ మేది' యని చాటుగా వారి నడుగఁగా, "అయ్యా! గుట్టలఁబట్టి తిరుగువారము. మాకు దేశమేమి యని నర్మగర్భముగాఁ బలికిరి. వారిఁక వెడలుట మంచిదని చంద్రగుప్తుఁడు కనుసైఁగ చేసెను. అది గ్రహించి యెక్కడివారక్కడ జారిపోయిరి.

చంద్రగుప్తుని పంజరపరీక్షను గూర్చి భటులు నందులకుఁ జెప్పిరి. నందులు చంద్రగుప్తుని నేర్పున కాశ్చర్యపడి వచ్చి, "చంద్రగుప్తా! ఇది కృత్రిమసింహమని యెట్లు తెలిసికొంటి"వని యడిగిరి. అంత జంద్రగుప్తుఁ డగ్ని రవులుగొల్పి సింహము ప్రక్కఁ బెట్టెను. పైనఁ బూసిన లక్కయు మైనమును గరఁగి లోపలి యినుపముక్కలు బయటపడెను. నందులు తమ రాజ్యములో పరీక్ష జరిగినందుకు సంతసించియును, జంద్రగుప్తుఁడు పరీక్షలో నెగ్గుటచే లోపలఁ గుమిలిరి. ఇంతటి బుద్ధిమంతుఁడగు శత్రువు శేషించుట వారి కిష్టము లేదు. ఒకానొకమంత్రి, మౌర్యపక్షపాతి నందులయింగితమును గ్రహించి యిట్లు పలికెను. "ప్రభువులారా! ఈ పరీక్షవలన మనదేశమునకు గొప్పకీర్తి వచ్చినది. మీరన్న మాటప్రకారము చంద్రగుప్తునికి విముక్తి కల్గింపుడు. రాజ్యమున కిట్టివారు లాభదాయకులు." అంత వేఱొకమంత్రి యిట్లనెను. "ఆర్యులారా! చంద్రగుప్తుని బ్రాహ్మణభోజనశాల కధికారిని జేయుఁడు." ఈ మంత్రి యిట్లేల చెప్పవలయునని నందులు రహస్యముగా రాక్షసునితో నాలోచించిరి. రాక్షసుఁడును రహస్యముగా "చంద్రగుప్తున కిది స్వల్పాధికారముగ దోఁచి, ఆతఁ డీపనిని సరిగా శ్రద్ధగా చేయకుండును. బ్రాహ్మణు లలిగి యాతని నెప్పుడేని శపింతురు" అని నందులకు నొడంబడికగా నుండులాగునఁ బలికెను. నందు లవుననుకొని సమ్మతించిరి.

మోక్షమయిన తర్వాత చంద్రుఁడు స్నానతర్పణములుచేసి క్రొత్త యుద్యోగమునఁ జేరెను.

---

# అభయ హస్తము

చంద్రగుప్తుఁడున్న సత్రముమీఁదుగా నొకనాఁడొక మహాతేజస్వియగు బ్రాహ్మణుఁడు పోవుచుండెను. దారిలో నొక తీగె యాతని కాలికి జుట్టుకొని నడక సాగకుండఁ జేసెను. బ్రాహ్మణునికిఁ గోపమువచ్చినది. దానిని పెల్లగించి, కాల్చి, నీటిలోఁ గలిపి త్రాగివైచెను. ఈ వింతచేష్టితమునకు దూరమునుండి చూచుచున్న చంద్రగుప్తుని కాశ్చర్యము కలిగినది. ఆయన విషయము కనుగొనవలయుననియు, నంతటి పట్టుదలగలవాఁడు తన కేవిధముననైనను సాయపడ గలఁడనియు దలఁచి ఆ బ్రాహ్మణు నాతిథ్యమునకుఁ బిలిచెను. అతని పేరు విష్ణుగుప్తుఁడు.

బ్రాహ్మణుఁడు నాతనిప్రార్థన నంగీకరించెను. సత్కారానంతరమున నాయనపోవు సమయమున, నింకను రెండు మూఁడు దినము లిటనే యుండుఁడని చంద్రగుప్తుఁ డాయనను బ్రార్థించెను. విష్ణుగుప్తుఁడును నాతని ప్రార్థనచొప్పున రెండు మూఁడు దినము లచటనే గడపెను.

ఒకనాఁడు విష్ణుగుప్తుఁడు చంద్రగుప్తుని పేరును నూరును నడిగెను. తాను సర్వార్థసిద్ధి మహారాజు కుమారుఁడగు మౌర్యుని తనయుఁడ ననియు, పేరు చంద్రగుప్తుఁ డనియు జెప్పి, తన దుర్దశనుగూర్చిగూడ దుఃఖక్రోధములు బయల్పడునట్లు చెప్పెను.

ఇంకను దనకు శత్రువు లెప్పుడైనను బ్రాణము తీయుదు రని యనుమానము కూడ బాధించుచున్న దనెను.

తన జనకుఁడు ప్రతిష్ఠించిన విరూపాక్షస్వామికి నిత్యారాధన నిలిచిపోయినదనియు, తాను జీవచ్ఛవముగా నీ విధమున సేవకావృత్తిఁ జేయుచున్నాననియు నాక్రోశించెను. తన్నుఁ గూడ వెంటఁ దీసికొనిపోయి ధన్యుని జేయవలసిన దని యాయనను బ్రార్థించెను.

'మహాపురుషులు మహాపురుషలక్షణములను గుర్తింప గలరుగదా! నీవు రాజపుత్త్రుఁడ వగుటచే క్షత్రియున కేమియు దీసిపోవు. ఆపదలందు ధైర్యగుణము క్షత్రియుఁడ వగు నీ కవసరము. బుద్ధి పౌరుషములచే శత్రువులకు నీళ్లు త్రాగించగలుగుదువులే. ఇట్టి దీనపుఁబలుకులు నీకుఁ దగ' వని యతఁడు చెప్పెను. 'మీదయ యున్నచో నట్లే యగుగాక' యని, చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని శరణుచొచ్చెను.

విష్ణుగుప్తుఁ డప్పుడు, "చంద్రా! భయములేదు. నందుల యానందము మూఁడునాళ్ల ముచ్చట. అపరాధు లగు శత్రువులను నిగ్రహించుటలోఁ దప్పేమియులేదు. నాశక్తి కూడ నీ పౌరుషమునకుఁ దోడ్పడునులే. కాని కయ్యమునకు కాలుద్రవ్వవలయునుగదా! ధర్మమునకు విరుద్ధము కాకుండు నట్లొక యెత్తు నెత్తెదను. దానికి నందు లిచ్చగింపక నాకు కోపము తెప్పించు పనిచేయుదురు. అట్లుగదా నిప్పురగులుట" అనిచెప్పి గంగానదిలో స్నానజపాదులకై పోవుచుండెను.

నందులు సత్త్రవ్యవహారమును జూచి పోద మని, బాహ్యోద్యానమునుండి రాచనగరునకుఁబోవుచు నాసత్త్రము కడ దిగిరి. ఇదియే తరుణమని విష్ణుగుప్తుఁడు సత్త్రములోనికి

బిరబిర పోయి రాజుగారు కూర్చుండుటకై వేసిన సువర్ణ పీఠముపైఁ గూర్చుండెను.

అటునిటు తిరిగివచ్చిన నందుల కా బ్రాహ్మణుఁడు కంటఁబడెను. వీరికి, బ్రాహ్మణుఁడు తమ్ము నవమానించుట కట్లు చేయుచున్నాఁడని యొడలు మండినది. 'ఏమిది?' అని భటులవంకఁ జూచిరి. వారు 'దిగవయ్యా' అని విష్ణుగుప్తుని బెదరించిరి. తాటియాకుల చప్పుడునకు కుందేళ్లు బెదరునా? విష్ణుగుప్తుఁడు వారిమాట లెక్కపెట్టలేదు. వా రాతనిని బట్టుకొని లాగిరి. ఆ లాగుటలో విష్ణుగుప్తుని జుట్టుముడి ఊడెను. ఒక్కమాటుగా విష్ణుగుప్తుని నేత్రములు చింత నిప్పులైనవి. అతఁ డపర విశ్వామిత్రుఁ డయ్యెను. మహా క్రోధమున నందుల నాతఁ డిట్లు నిందించెను.

"భోజనమునకు వచ్చిన బ్రాహ్మణుని లాగి యవమానించితిరి. ఇదిగో చూడుఁడు. మీ గతి కుక్కలకు నక్కలకుఁ బాలగునట్లు మిమ్ములనుగూడ లాగించెదను. కార్తవీర్యాదులను బరశురాముఁ డేమిచేసెనో వినియుండలేదా! మఱచిపోతిరా! దండనీతిశాస్త్రము నధ్యయనముచేసిన నాకు మీపైఁ బగ యెట్లు తీర్చుకొనవలయునో తెలియును లెండు. మిమ్ములను సంహరించిగాని, యీజుట్టు మరల ముడివేయను. ఈ ప్రతిజ్ఞ తప్పితినా మహాపాతకికిఁ గలుగు గతియే, నాకును గలుగును" అనుచుఁ జుఱచుఱఁ జూచుచు నచటి నుండి కదలిపోయెను.

నందులకు కొంతసేపటివఱకు నేమియుఁ దోఁచలేదు. పరిచారకులు చల్లనిమాటలు పలికి వారిని శాంతింపఁజేసిరి. అచటనున్న యితర శ్రోత్రియులు "ఇంతటి అన్యాయమున కొడిగట్టిన నందుల కేదోగతి పట్టునుపో" యనుకొనుచుఁ బోయిరి.

వారిలో బ్రాహ్మణవేషమునఁ బర్వతరాజు గూఢ చారులుకూడ నుండిరి. వారు వచ్చి సత్రమున జరిగిన విషయమును దమరాజునకు విన్నవించిరి. ఎప్పటికైన చంద్ర గుప్తుఁడు తన సహాయ మర్థించునని పర్వతరా జనుకొనెను. అట్లు వచ్చినపు డాతనికి సాయముచేయుట తనకుకూడ లాభదాయకమని తలఁచెను.

విష్ణుగుప్తుఁడుకూడ శాంతించి యాలోచించెను. నందులవలన లోకులకు క్షేమములేదు. నందులను దుద ముట్టింపవలయును. నీతితోఁ బ్రజారక్షణ జరుగవలెను. చంద్రగుప్తునివంటి ఉపాయజ్ఞుఁడు, సౌజన్యముగలవాఁడు, పౌరుషవంతుఁడు నగువాఁడు రాజు గావలెఁ గాని, యీ తుచ్ఛ నందులా? అని యతఁ డాలోచించెను. చంద్రగుప్తుఁడు వచ్చి విష్ణుగుప్తునికి నమస్కరించి యిట్లనెను. "బ్రాహ్మ ణోత్తమా, చూచితిరిగదా! ఇఁక నాకీవృత్తి యెట్లు సరిపడును? మీరే నాకు దిక్కు; మీతో వచ్చెదను. మీ రేమి చెప్పిన నది చేయుదును."

విష్ణుగుప్తు నాతనిపై దయపుట్టి యిట్లనెను. "కుమారా! చంద్రా! నీ శత్రువులు నశించిరనియే భావిం

పుము. కొన్నాళ్లలో నీకు సింహాసనము లభించును. ఆ వైభవమును జూచిగాని నేను నిన్ను విడువను. తదుపరి నా జపతపములు చూచుకొందును'' అని వీపుతట్టి చంద్ర గుప్తుని లేవదీసెను.

కార్యాలోచనకు నిర్జనప్రదేశము వలయునుగదా! గురుశిష్యు లిరువురు నొక చెట్టునీడకుఁ బోయిరి. విష్ణు గుప్తుఁ డొకసారి పైకిఁ జూచెను. తర్వాత చంద్రగుప్తునితో ''నందులకు మిత్రులెవరు? శత్రులెవ'' రని యడిగెను. చంద్రగుప్తుఁ డిట్లు చెప్పెను. ''స్వామీ! మంత్రి రాక్షసుఁడు తన యుక్తిచేఁ గొందఱను రాజున కిష్టులుగాఁ జేసెను. కొంద ఱాతనికి భయపడి రాజున కిష్టులైనట్లు నటింతురు. కప్పములు వసూలుచేయుటలో రాక్షసుని జెప్పి మఱొకరిని జెప్పవలయును. తిరుగఁబడినవారిని దండింపక విడువఁ డీ రాక్షసుఁడు. నాకుఁ జూడఁగా రాక్షసుఁ డితరుల శ్రేయస్సు నోర్వఁడని తోఁచుచున్న'' దనెను. విష్ణుగుప్తుఁ డిట్లనెను. ''చంద్రా! నీ వింకను బాగుగా నెఱుఁగవు. నీ పలుకులనుబట్టి రాక్షసుఁ డగ్గలమగు స్వామిభక్తి గలవాఁడుగాఁ దోఁచుచు న్నాఁడు. మంత్రిపదమున కట్టివాఁడే యోగ్యుఁడు సుమీ!'' యనెను. 'మఱి నా ప్రశ్నకు సమాధానము చెప్పవా?' యనఁ జంద్రగుప్తుఁ డిట్లనెను.

''నందులకు కాశీరాజును, మత్స్యరాజును మిత్రులు. పర్వతరాజు ఉదాసీనుఁడు. కాని రాక్షసునివలన వెనుక సాయము పొందియుండుటచేఁ బర్వతరాజు రాక్షసుని మిత్రు

నిగా భావించుచుండును. కాని యీమధ్య కపటశిల్పమున పంజరపరీక్ష చేయించినాఁ డెంమువల్లనో యీపర్వతేశ్వరుఁడు! దానివలననే నాకుఁ గారాగార విముక్తి గూడ కలిగినది.''

విష్ణుగుప్తుఁడు సరేయని మాత్ర మనెను. మహా పురుషులు, తమ యాలోచనలు పైకిఁ గ్రక్కరు కాఁబోలు! ఆయన చంద్రునితో 'మీతండ్రికిఁ బ్రియులైనవా రీ యూర నెవ?'రని యడిగెను.

చంద్రగుప్తుఁ డిట్లు పలికెను. ''నా తండ్రివలననే భాగురాయణాదులు సేనాపతులయిరి. ఇప్పుడు వారి కా కృతజ్ఞతాభావ మున్నదో లేదో! ఇఁక రాక్షసుఁడో, మా తండ్రి చేయు పనులకు నెన్నఁడు నెదిరించినవాఁడు మాత్రము గాఁడు.''

'రాక్షసుఁడు శౌర్యవంతుఁడేనా?' యని విష్ణుగుప్తుఁ డింకొక ప్రశ్న వేసెను. చంద్రగుప్తుఁడు, రాక్షసుఁడు మహా పరాక్రమవంతుఁ డనియు, తాను వినుటమాత్రమే కాక, ఆతని వీరవిహారమును జూచికూడ నున్నాననియు, నాయన వలననే రాజ్యము స్థిరముగా నడుచుచున్న దనియు రాక్షసునిఁగూర్చి పలికెను.

విష్ణుగుప్తునికి రాక్షసునియెడల సద్భావము పుట్టెను; గాని మనసులోనే దాని నాతఁ డణఁచిపెట్టెను. నందులను దుదముట్టించి, రాక్షసుని వశపఱచుకొనవలయునని యాతఁ డూహించెను. చంద్రగుప్తునితో రహస్యముగా నిట్లు చెప్పెను.

''భాగురాయణాదుల స్వహస్తాక్షరములతో 'సమ్మతించితి' మను నొక వాక్యము నొక జాబులో వ్రాయించి

తేఁగలవా? ముందుగా నేను నీకొక యుత్తరము వ్రాసి యిచ్చెదను. అది నీ వర్థముచేసికొని వారికిఁ జూపుము. అప్పుడు నీయందు వారికి నమ్మకము కుదురును. అప్పుడు నీ చేతివ్రాలతో నొకప్రత్యుత్తరము నీవు వ్రాసి వారి సంతకములకుఁ గొంతచోటు వదలి, సమయోచితమగు మాటలాడి వారి సమ్మతి వ్రాయించుకొని ర'మ్మనెను. నైమిశారణ్యమున, గంగాతీరమందు సోమేశ్వరాలయమువద్ద నున్న ఇందుశర్మ యను తన మిత్రునింటికి, ఆ సమ్మతిపత్రమును దెచ్చి తన కిమ్మని చెప్పెను. ఇంక నేదియో నాతనితో సంభాషించి విష్ణుగుప్తుఁడు వెడలిపోయెను.

భాగురాయణాదులవద్దకుఁ జంద్రగుప్తుఁడు రాఁగా, వా రాతనిపై వాత్సల్యముతోఁ దమ విచారమును వెలిఁ బుచ్చిరి. వారి వాత్సల్యమునకుఁ గృతజ్ఞతఁ దెలుపుచుఁ జంద్రగుప్తుఁ డిట్లు మనవిచేసెను :— "మాతండ్రి కాశిలో నీశ్వరాలయమును స్థాపించిన సంగతి మీరెఱుఁగనిది కాదు కదా! కాశీపట్టణవాసి కేశవదాసువద్ద తన్నిమిత్తకమైన ధనము దాచుటకూడ మీకుఁ దెలిసియుండవచ్చు. ఇంతలో మా పెద్దలకు మూడిన యాపద, యాయన యుద్దేశమునే మూలచ్ఛేదము చేసినది. ఏమయినను లాభముండు నను నుద్దేశముతో నే నీనడుమ కేశవదాసునకు జాబువ్రాయఁగా నాతఁ డీ సమాధానము వ్రాసినాఁడు ; అం దిట్లున్నది.

"శ్రీయుతులయిన రాజశ్రీ చంద్రగుప్తరాజునకు సేవకుఁడు కేశవదాసుని విన్నపము. మీ జాబందినది. మీ తండ్రిగారు శివారాధనకై యిచ్చిన ధనము నావద్ద నున్న

మాట వాస్తవమే. మీ రింకను జిన్నవారగుటచే నెవ్వరికి నాక్షేపణలేని విధమున వ్యవహారము నడుపుకోవలయును. మీకు పెద్దలు నాప్తులు నగువారి సమ్మతిఁ దెలుపుచు నాకు మీ రుత్తరము వ్రాసితిరేని మీ తండ్రిగారు ప్రారంభించిన ధర్మకార్యమును నెఱవేర్చగలవాఁడను.

చిత్తగించవలెను,
మీ సేవకుఁడగు
కేశవదాసు

భాగురాయణాదు లిట్లనిరి:— "చంద్రకుమారా! నీ యుద్దేశ మెంతయుఁ బ్రశంసింపఁదగినది సుమా! ఈ పుణ్యకార్యమున నూనెగొలిచిన మానికవలె మాకును గొంచెము ధర్మము లభించును. నందులు నీ కింతటి యుపకారము చేసియున్నను, నీ బుద్ధి ధర్మమునం దింత నిశ్చలమై యున్నది. మీ తండ్రి పెట్టినదే కదా మాకీ యన్నము? అట్టివానిని పోగొట్టుకొనుట మా దౌర్భాగ్యముగాక మఱేమి? ఈ చిన్న విషయమున మా సమ్మతి తెల్పుట మేము తీర్చవలసిన ఋణములో నెన్నవవంతు? సరే! నీ వావర్తకునికి సమాధానము వ్రాయుము. స్వహస్తాక్షరములతో మా సమ్మతిని చేవ్రాలుచేసి తెలిపెదము."

అట్లే చంద్రగుప్తుఁడు కేశవదాసుని పేర మర్యాదను బాటించుచు నుత్తరమువ్రాసెను. భాగురాయణాదు లెనమండుగురును తమ సమ్మతులను దెల్పుచుఁ జేవ్రాళ్లను చేసిరి.

చంద్రగుప్తుఁడు వారికి నమస్కారములు దెల్పుచు నటనుండి కదలెను.

గుర్వాజ్ఞానుసారముగా, నైమిశారణ్యమందు, ఇందుశర్మయింట చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని గలిసికొనెను. తాను దెచ్చిన లేఖ యిచ్చెను. విష్ణుగుప్తుఁడును దన యభిమతమునుగూడ వ్రాసియుంచెను. "ఇది చంద్రగుప్తున కభిమత కార్యము" అను పంక్తి చంద్రగుప్తుఁడు వ్రాసిన దానిలో కడపటిది. కొంచెము తాను వ్రాయుటకుఁ గూడ పైన విడిచియుంచుమని యిదివఱకే యాతఁడు చంద్రగుప్తునికిఁ జెప్పియుండెను. ఈ కడమబంతి క్రిందనే "చంద్రగుప్తున కభిమతమైన కార్యము మాకుసైత మభిమత"మని భాగురాయణాదులు స్వహస్తాక్షరములతో వ్రాసియిచ్చిన సమ్మతి గలదు. విష్ణుగుప్తుఁడంత తనకు వలసిన భాగ మా కాగితమునుండి కత్తరించి, మిగిలినది పారవైచెను. ఇది ముందే రాజ్యతంత్రమున నాతఁ డుపయోగించునో?

తరువాత నిందుశర్మతో నాతఁడు "నీకును నాకును మధ్య దాపఱికమెందులకు? ఇదిగో వినుము" అని, మౌర్యవధను, చంద్రగుప్తుని పూర్వవృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు చెప్పి, భావికార్యక్రమము నిట్లు దెలిపెను. "నీవు నాకీ కార్యమునఁ దోడ్పడవలయునని నాకోరిక. నీ విపుడొక బౌద్ధసన్న్యాసివి కమ్ము. జీవసిద్ధి యను మాఱుపేరు పెట్టుకొనుము. నీ శిష్యులకు కొందఱికి, సమయోచితమగు వేషభాషానామములు గల్పించి, నీతోఁగూడ పాటలీపుత్రమునఁ బ్రవేశపెట్టుము. నీ జ్యోతిశ్శాస్త్రప్రావీణ్యముచేతను, నీ మంత్రవిద్యాప్రభావమువలనను నెప్పటి కప్పు డేదో ప్రయోజనమును సాధించుచుండవలయును. రాక్షసాదులను

బుట్టలో వేసికొనవలయును'' అని యింకను గొన్నిరహస్య
ములా యిందుశర్మ కుపదేశించెను. ఇందుశర్మ విష్ణుగుప్తుని
మెచ్చుకొనుచు, ''బుద్ధియందు బృహస్పతివి; నీతియందు
శుక్రాచార్యుఁడవు. నీవు చెప్పినట్లన్నియు తలఁదాల్చి
చేయుదును. మఱి నీ వెక్కడ నుందువో తెల్పు''మనెను.

''చంద్రగుప్తుని వెంటఁబెట్టుకొని పర్వతేశ్వరుని
యొద్దకుఁ బోవుచున్నాను. నీవు మెలకువతో నుండవలయును
సుమా!'' యని విష్ణుగుప్తుఁడు హెచ్చరించెను.

ఇందుశర్మశిష్యులలో నిద్దఱను వెంటఁబెట్టుకొని
విష్ణుగుప్తుఁ డందుండి తరలిపోయెను.

---

## మిత్రలాభము

ఇటు నిందుశర్మ కొందఱు శిష్యులతో క్షపణక వేష
మున బయలుదేరెను. వైద్యవేషము, మంత్రజ్ఞవేషమును
శిష్యులకు వేయించెను. భాగురాయణాదులవద్ద మెలఁగు
చుండుఁడని శిష్యుల కుపదేశించి, తాను రాక్షసుని కాప్తుని
వలె నటించుచు, నప్పుడప్పుడు నవనందులనుగూడ దర్శించు
చుండెను.

అన్నసత్రమున జరిగిన బ్రాహ్మణావమానమును
చారు లప్పుడే పర్వతరాజునకుఁ దెల్పిరి. విష్ణుగుప్తుని శపథ
మును విని పర్వతరాజు మంత్రిశబరవర్మతో 'దైవయత్న
మెట్లున్నదో చూచితివా?' యనెను. మంత్రి ''ఇది

కేవలము దైవికముగాదు. ఆ బ్రాహ్మణుఁడు తెలిసియే స్వర్ణపీఠము నెక్కియుండును. అతఁడు వెఱ్ఱివాఁడై యిట్లు పలికియుండినచో నందుల కే బాధయు నుండదు. లోక మన్యథా తలంపకుండునట్లు, పైగా మెచ్చునట్లు, నందులతో విరోధమును సంపాదించియున్నాఁడు. ఇంతకుఁ జంద్రగుప్తుఁ డదృష్టవంతుఁడు. అట్టి బ్రాహ్మణుని ప్రాపు లభించినది'' అని పలికెను. నాఁటికి కొలువు ముగిసెను.

మఱునాఁడు రాజు కొలువులోనికిఁ గొందఱు చారులు వచ్చి, ''స్వామీ! లంపాక దేశాధిపతి సామంతులనుగూడ కట్టుకొని మనపై దండెత్తి వచ్చుచున్నాఁడు. అప్పుడే పొలిమేరలలో నలజడి ప్రారంభమయినది'' అనిరి.

''మంత్రీ! పులికూన పిల్లివలె నున్నదని యూరకుంటిమి. ఈ లంపాకపతి వ్యవహార మెంతవఱకు వచ్చినదో చూచితివా? ఇప్పుడోప్పరికింపరాదు. కిరాతాధిపతియైన మాతంగుని సైనికులను మొదట సన్నద్ధులఁజేసి నడుపుము. మన సామంతులనుగూడ పొలిమేరలకుఁ బంపవలయును. పార్వతీయుల బల మీ నగరరక్షకై యుంచుము'' అని రాజానతిచ్చెను.

ఈ సమయమున విష్ణుగుప్తుఁడు చంద్రగుప్తునితో రాజాస్థానమును బ్రవేశించెను. చంద్రగుప్తుని మోము వాడి యున్నదని చూచి విష్ణుగుప్తుఁ డాతని నట్లుండుటకుఁ గారణ మడిగెను. తన కులనాశనము తలఁపునకువచ్చి మనస్సు దుఃఖపడుచున్నదనియు విష్ణుగుప్తుని యండఁ జూచుకొనియే తాను బ్రదికియున్నాననియు చంద్రగుప్తుఁడు సమాధాన

మిచ్చెను. క్షత్రియున కాపదలయందు ధైర్యముండవలయు ననియు, దైవబలము తమ కనుకూలించుననియు, గురువు శిష్యునకు ధైర్యము చెప్పెను.

మఱునాఁ డా రాజు సమయము గుర్తెఱిఁగి, సుముహూర్త మరసి, ప్రతీహారులచే ముందుగాఁ దెలిపించికొని విష్ణుగుప్తుఁడు చంద్రగుప్తసమేతముగా రాజసందర్శనము చేసెను. కుశలప్రశ్న లయినవి. వచ్చినప్రయోజన మేమని పర్వతరా జడుగఁగా, నేకాంతయోగ్యమగు రాజకార్య మొకటి కలదని విష్ణుగుప్తుఁ డనెను. రాజు చూపు నలుదిక్కులకుఁ బరపెను. ఇంగితమెఱిఁగి సభ్యులందఱు వెడలి పోయిరి.

పిమ్మట విష్ణుగుప్తుఁ డిట్లు పలికెను. "రాజోత్తమా! నీ ప్రతాపముచే నితరరాజు లనేకులు సామంతులై నీకు లోఁబడిరి. వారి ప్రజలును సుఖపడుచున్నారు. కాని నందులు కావించిన ఘోరములు వినియుందురేమో! మీ చారులు గ్రహింపని విషయము లుండును గనుకనా? నందరాజ్యమున ప్రజలు చంద్రోదయమును గోరుచున్నారు. అధికారులుసైతము రాక్షసునెడ విశ్వాసముదప్పియున్నారు. ఇదిగో! సమ్మతిని వారు వ్రాసియిచ్చిన లేఖ" యని యందిచ్చెను.

పర్వతేశ్వరుఁ డది చూచికొనెను. నందనిగ్రహము చంద్రగుప్తునిసాయమున భాగురాయణాదులతోడ్పాటుతో సులభముగా నెఱవేరుసని యనుకొనెను. అయినను మంత్రులతో నాలోచించిగాని విష్ణుగుప్తునికి బదులు చెప్ప

రాదని నిశ్చయించుకొని, "కొంచెము సేపు విశ్రమింపుఁడు. తర్వాత మాట్లాడుకొందము" అని వారితోఁ జెప్పి కొలువు పీఠమునుండి లేచెను. విష్ణుగుప్తుఁడిచ్చిన పత్రమును తన కుమారుఁడగు మలయకేతువు చేతి కిచ్చెను.

అంత మంత్రిశబరవర్మ యొకానొక దివ్యభవనమున విష్ణుగుప్త చంద్రగుప్తులను విడియించెను. వారు స్నానాదికృత్యము లొనర్చుకొనిరి. దేవతార్చనమైన పిదప భోజనములు చేసి విశ్రమించిరి. రాజునానతిచే చంద్రగుప్తునికి దివ్యమాల్యాంబరాభరణములు వచ్చెను. మఱునాఁడు, ఆప్తమంత్రులతో నేకాంతముగ పర్వతరాజాలోచించెను. 'మంత్రివర్యులారా! చంద్రగుప్తుఁడు నందులయెడ విరోధము సాధింపవచ్చెనో లేక శత్రువులులేని పైతృకరాజ్యమునుగూర్చి వచ్చెనో తెలియుటలేదు. కాని విష్ణుగుప్తుని మాటలనుబట్టి యీరెండు భావములును గలవని తెలియుచున్నది. ప్రస్తుతము మనపై లంపాకాధిపతి దండెత్తి వచ్చుచున్నాఁడు. కర్తవ్య మాలోచింపుఁ" డని రాజనెను.

ఒకమంత్రి—"చంద్రగుప్తునికారణమున మనకు నందులతో పోరాటమేల? పైగా రాక్షసుఁడక్కడనున్నాఁడు. శూద్రస్త్రీయందుఁ బుట్టిన చంద్రగుప్తుఁడు ప్రజల కంగీకారమగునో కాదో? కాఁబట్టి చంద్రగుప్తునియెడల అభిమానమున్నట్లు నటింతము. వలయునేని మనవద్ద నేదే నుద్యోగమిత్తము. పైగా యింటఁ గెలిచిగదా రచ్చగెలువవలయును! లంపాకపతి గర్వభంగము చేయవలయునుగదా!

కాఁబట్టి చంద్రగుప్తుని జోలికి మనము పోవుట తగ దని నా మనవి'' అని యనెను.

శబరవర్మ - ''రాజేంద్రా! ఈకాలమున దక్షుఁడును, శూరుఁడునగు రాజే కులమువాఁ డయినను బ్రజ లనుమతింతురు. చంద్రగుప్తునికిని నందులకును గల తారతమ్యము మనకు దెలిసినదే గదా! భాగురాయణాదులంతటి యధికారులు సైతము తమ యభిప్రాయమును వెలిబుచ్చియున్నారు కదా! కావున, నందులు భేదోపాయసాధ్యులు, లంపాకపతిని గూల్చితిమా, శ్రమలేక గౌడదేశము మనకు కైవసమగును. చంద్రగుప్తుని వలన ప్రత్యుపకారము మనకు లభించును'' అని చెప్పెను.

రాజు శబరవర్మమాటలను మెచ్చెను. ముందు లంపాకపతి గర్వభంగమునకై నదీతీరమందు సేనల నాయత్త పఱచుఁ డని మంత్రులకుఁ జెప్పి లోనికిఁ బోయెను.

---

## ఉద్యోగ పర్వము

అది పర్వతరాజు నిండు కొలువు కూటము. విష్ణుగుప్తుఁడు రాజును దీవించి యుచితాసనము నలంకరించెను. చంద్రగుప్తుఁ డాతనిప్రక్కనే యాసీనుఁడయ్యెను. అంత రాజు విష్ణుగుప్తునివంక తిరిగి ''మీకును చంద్రగుప్తునికి నెంతకాలమునుండి పరిచయము?'' అని ప్రశ్నించెను. విష్ణుగుప్తుఁ డిట్లు చెప్పనారంభించెను. 'మా కలయిక కొలది

కాలము క్రిందట జరిగినదే యైనను, నందులుచేసిన యవమానమును, వారి దుష్టత్వమును క్షమింపరానివి. నేను మిమ్ములనాశ్రయించినట్లే చంద్రగుప్తుఁడు నన్నాశ్రయించినాఁడు. కోపము లోకమున నవసరము. కాని విమర్శాపూర్వకమైన కోపము యశస్కరము. కోపపూర్వకమైన విమర్శ హానికరము. అట్టి గుణముగలవాఁడు ప్రభుపదమున కయుక్తుఁడు. నందులయెడ నా కోపము విమర్శాపూర్వకమయినది. కావున నా తపఃశక్తిని బాధింపదు. పైగా పౌరుషమునకుఁ దోడ్పడును. నందులు విమర్శింపక నన్ను గెంటించిరి. దాని ఫలితము వారికి తగిలి తీరవలయును. కావున జంద్రగుప్తునికంటె నాకే నందనిగ్రహమవశ్య కర్తవ్యము. బుద్ధి పౌరుషబలములే వారి నాశనమునకు సాధనములు. అందుచే నిన్నాశ్రయింప వచ్చితిని. నీవో, శూరుఁడవు, మనస్వివి. నీకు ఖ్యాతియుఁ, జంద్రగుప్తునకు రాజ్యమును, నాకు ప్రతిజ్ఞానిర్వాహణమును సిద్ధించునని యిటకు వచ్చితిని. నీకు యుద్ధోత్సాహము కలదా, సేనాసమేతుఁడవై తరలిరమ్ము. లేక సేనలబంపుమవా, యెరఁజూపి మహామీనములఁ గట్టునకుఁ దీసి బడవైచున ట్లుపాయాంతరములచే నందుల నిగ్రహింపఁగలను. ఇది దండయాత్రకు తగిన సమయమని వేఱుగఁ జెప్ప నక్కఱలేదుగదా!'' అని తన మాటలు ముగించెను.

పర్వతేశ్వరా జంత నిట్లనెను. ''అయ్యా, విప్రోత్తమా! లంపాకపతి యిపుడు మాకొక పని గల్పించినాఁడు. కావున యుద్ధప్రయత్న మెట్లును తప్పదు. అయినను దండో

పాయముకన్న మిగిలిన యుపాయత్రయమున శత్రువులను లోఁబఱచుకొనరాదా? హింసాప్రధానమగు పద్ధతి యేల?''

దానికి విష్ణుగుప్తుఁ డిట్లు చెప్పెను. ''రాజా! మీరు చెప్పినది నేను కాదనను. కాని దుష్టులగు నందులు మిగిలిన యుపాయములచే సాధ్యులుకారని నాకుఁ దోఁచుచున్నది. పైగా చంద్రగుప్తునికి నందులపై నెట్టి ప్రతీకారేచ్ఛ గలదో, వారు గావించిన మౌర్యవధయే చెప్పునుగదా! ఇఁక నాకును నవమానముచేసినందుకు ప్రతిజ్ఞ చేసితిని. యుద్ధము మానితిమా, అది భంగమగుటకూడ నగును.''

చంద్రగుప్తుఁడంతఁ బర్వతేశ్వరునితో నిట్లు పల్కెను. ''రాజోత్తమా! కులనాశకులైన నందుల నిగ్రహింపక లభించునట్టి ప్రభుత్వముకంటె అడవిని గాపురముండుట మేలని నే నిదివఱకే యాచార్యులతోఁ జెప్పికొంటిని. వీ రిచ్చిన యభయమును నట్టిదే.'' పర్వతరాజు నవ్వుచు, ''అట్లయిన రాజుల నాశ్రయింపక తపోధనులగు విప్రుల నేల యాశ్రయించితి''వని యడిగెను. ''ఈ ఆచార్య ప్రసాదముననే రాజాధిరాజులైన మీ యాశ్రయము లభించినది''అని చంద్రగుప్తుఁడు నేర్పుగా బదులుచెప్పెను. ఇట్లు పలుకుటచే పర్వతరాజు సంతసించెను. అంత విష్ణు గుప్తునితో 'లంపాకపతిని జయించుకార్యమున మీ యభి మత మేమి?' యని పర్వతరా జడిగెను.

ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు ''భూమీశా! మాకొక నేర్పరియగువాని నప్పగింపుఁడు. మేము చెప్పినట్లు నడచు వాఁడుగా నుండవలయును. తర్వాత మా యభిప్రాయము

మీకు తెలియఁగల" దనెను. రాజు కమలాపీడుఁ డనువానిని విష్ణుగుప్తుని కప్పగించెను.

అంత విష్ణుగుప్తుఁడు ప్రాగ్జ్యోతిషపురాధిపతి పేర రెండుత్తరములు వ్రాసి, కమలాపీడునికి రహస్యముగా నేదో బోధించి, కొందఱు పరిజనులను దోడ్కొని ప్రాగ్జ్యోతిషమున కేఁగుమని పంపెను. వాఁడును పోయి తత్పురబాహ్యోద్యానమున బసచేసెను.

అంత కమలాపీడుఁడు తన పరిచారకులలో నొకని నొకజాబిచ్చి, కొన్నిమాటలుచెప్పి యూరిలోనికిఁ బంపెను. వాఁడు "అయ్యా! పర్వతరాజురాయబారి యిచటికి వచ్చియున్నాఁడఁట. ఆయనకీయుత్తరమునిమ్మని మారాజుగారు పర్వతరాజు చెప్పిరి" అని అందఱ నడుగుచు దిరుగుచుండెను. రాజభటులాతనిని బట్టుకొని, రాజసమ్ముఖమునకుఁ దీసికొనిపోయిరి. వానిని కావలియందుంచి రాజా యుత్తరమును దీసికొని, చారులఁ బంపి వెదకించి, కమలాపీడుని తన యెదుటికిఁ బిలిపించెను.

కమలాపీడుఁడు కట్నములు పట్టుకొని రాజసమ్ముఖమున కేతెంచెను. దారిపొడవున రాజభటులు బారులు తీర్చి నిలిచిరి. రాజునకు నమస్కరించి, కట్నము లర్పించి, "రాజోత్తమా! రాజాధిరాజ! పర్వతేశ్వరులు తమ కుశలము నడిగిరి" అని తత్పురాధీశ్వరునితో ననెను. ఆ రాజును తగిన యుత్తరమిచ్చి వచ్చినప్రయోజన మేమని రాయబారి నడిగెను.

"దేవరా! సత్కులీనులైన మీతోడి బాంధవ్య మపేక్షించి మారాజుగారు మమ్మిక్కడకుఁ బంపిరి. మీ సంబంధము జనకదశరథ సంబంధమువలె లోకహితమున కగును" అని చెప్పుచు తాఁదెచ్చిన లేఖను రాయబారి రాజున కందించెను. అందు "స్వస్తిశ్రీ కామరూపదేశాధీశులయిన సూర్యవర్మకు బర్వతేశ్వరుఁడు సేయు విన్నపములు. మీ పుత్రికను మా మలయకేతువునకిచ్చి పెండ్లిసేయఁగోరి మా రాయబారిని మీయొద్దకు బంపియున్నాను. తమ కుమారిక జాతకముతోఁబాటు మీపురోహితుని బంపుదురని యాశింతును. ముహూర్తము త్వరలో నిర్ణయింతము. ఈ సంబంధమువలన మా యభ్యుదయము మీదగును. మీ యోగక్షేమములు మావి యగును" అని ముఖ్యముగా వ్రాయఁబడి యుండెను.

ఇది తగిన సంబంధమని రా జూహించెను. రాయబారికి పురములో విడిది నేర్పాటు చేయించి, వస్త్రాదు లర్పించెను. "కాలవిలంబము కాకుండ మీకిమ్మని మీ రాజుగా రొక లేఖఁ బంపియున్నారు. ఇదిగో!" యని రా జా రాయబారితో ననెను. అది యందుకొని చదువుచుండఁగా రాయబారికి ముఖమున నెత్తురుచుక్క లేకుండెను. రా జట్లగుటకు కారణమేమి యని యాత్రముతో నడిగెను. రాయబారి తలవంచుకొని యూరకుండెను. అంత రాజు తనమంత్రితో నా యుత్తరమును దీసి చదివి చెప్పవలసినదని పలికెను. మంత్రి యుత్తరమును జదివి రహస్యముగ రాజుతో నిట్లనెను.

"ఈనడుమ లంపాకదేశాధిపతి యాస్థానములో నొక వివాదము జరిగినదఁట. అందులో కామరూపాధిపతి వంశమునందు సాంకర్యదోష మున్నదఁట. అట్టివానితో సంబంధము మనకు వలదు. ఈ సంగతి నీవు కదలివెళ్లిన తర్వాత తెలిసినది. అయినను తొందరపడరాదు. విచారింప వలసినదని యాస్థానప్రముఖులు దెల్పియున్నారు. నేనును నాలోచించితిని. భూదేవికి పౌత్త్రుఁడగు భగదత్తుని వంశ మందుఁ బుట్టిన కామరూపాధిపతి వంశమేమి? కళంకమేమి? ఇది గిట్టనివారు వేసిన వాదేమో! నీవు వెళ్లితివి గనుక రహస్యముగ రాజు కులశీలములను విచారింపుము. నీ మనస్సునకు బ్రశస్తమని తోఁచినచోఁ గార్యనిశ్చయము చేసి కొని రమ్ము" అని రాయబారిపేర పర్వతేశ్వరుఁడు వ్రాసి యున్నాఁ"డని చెప్పెను.

కామరూపాధిపతి యది వినుచునే తోక ద్రొక్కిన త్రాఁచువలె లేచెను. లంపాకపతిపై పగ ప్రకటించెను. వెంటనే లంపాకదేశముమీఁదికి సేనలు నడుపవలయునని సేనాపతుల నాజ్ఞాపించి రాయబారితో నిట్లనెను. 'మీ సంబంధము మాకు సమ్మతమే కాని, లంపాకపతిని నిగ్రహింపక శుభకార్యమునకుఁ బ్రయత్నింపము. ఈ సంగతి సందర్భములను మీ రాజుతో విన్నవింపు' మని యొక చిన్న యుత్తరమును వ్రాయించి యిచ్చెను.

రెండుమూఁడు దినములవఱకు నా రాయబారి యచటనే యుండెను. కామరూపాధిపతి లంపాకపతిపై దండెత్తు ప్రయత్నములన్నియు కన్నులారఁ జూచెను. పని నెఱవేఱిన

దని సంతసించి తిరిగి పర్వతరాజునాస్థానమునకు వచ్చెను. వృత్తాంతమంతయు రాజునకు రహస్యముగఁ జెప్పెను. తాను దెచ్చిన లేఖ రాజున కిచ్చెను. రా జప్పుడు శబరవర్మతో నిట్లనెను. "మంత్రీ! చూచితివా, విష్ణుగుప్తుఁ డెంతటి ప్రజ్ఞాశాలియో! మనము చేయవలసినకార్యము కామరూపాధిపతిచేఁ జేయించుచున్నాఁడు" అని విష్ణుగుప్తుని రావించి "మీరు సంకల్పసిద్ధులరు. మీరు కార్యము చేపట్టవలయునే గాని మాబోటివారి సహాయమెంత? నిమిత్తమాత్రమే కదా!" అని సబహుమానముగ నాతనిని, చంద్రగుప్తుని విడుదులకుఁ బంపెను.

---

## ఒడంబడిక

ప్రొద్దు గ్రుంకుచుండెను. చంద్రోదయసూచన లగుపించుచుండెను. లోకమున నిండ వెన్నెల చలువలు గ్రమ్మును. అట్టియెడ పర్వతరాజు యువరాజగు మలయకేతువుతో నిట్లనెను.

"కుమారా! చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని వెంటఁబెట్టుకొనివచ్చిన విషయము నీకుఁ దెలిసినదేగదా! ఈ మహాకార్యమున మనము తోడ్పడినచో వారివలన మనకగు ప్రత్యుపకారమేమియో తెలిసికొని రావలయును." మలయకేతువు తండ్రియాజ్ఞానుసారము కదలి చంద్రగుప్తుఁడును విష్ణుగుప్తుఁడును విడిసిన చోటికి వచ్చెను. రాజకుమారుని

చంద్రగుప్తుఁ డెదురేగి తెచ్చి కూర్చుండఁబెట్టెను. అంత నా రాజకుమారునితో విష్ణుగుప్తుఁ డిట్లనెను.

"ఓయి చిరంజీవీ! శౌర్యధనుఁడగు నీ వంటి వాఁడు పర్వతేశ్వరునకుఁ బుత్త్రుఁడగుట నిజముగా మా యదృష్టము. నీవును చంద్రగుప్తుఁడును మిత్రులై శత్రువులయెడ బరాక్రమించినచో నీకుఁ గావలసిన దేమి? నందులు నశింతురు. చంద్రగుప్తునికి రాజ్యము లభించును. పైతృకమగు రాజ్యమందర్ధభాగము సాయపడిన మీకిచ్చుటకిదివఱకే యతఁడు నిశ్చయించుకొన్నాఁడు. మీ రిరువురు రాజ్యభారములు మీ మీ రాజ్యములలో వహించి కలిసియుండఁగా మిగిలిన రాజులెల్లరు మీకుఁ దలలొగ్గవలసినవారే కదా! ఇదిగో! అర్ధరాజ్యము మీకు సమర్పింపఁదలఁచిన పత్త్రము; చంద్రగుప్తుఁడు స్వహస్తాక్షరములతో లిఖించినది. దీనిని మీతండ్రికిఁ జూపవచ్చు" ననుచు 'ఒడంబడిక పత్త్ర' మిచ్చి గంధతాంబూలములతో నాతనిని సాగనంపెను. మలయకేతువు తిరిగి తండ్రి వద్దకు వచ్చెను. జరిగిన విషయము దెల్పి యొడంబడిక పత్త్రము తండ్రి చేతిలో పెట్టెను. పర్వతేశ్వరుఁడు పరమానందభరితుఁ డయ్యెను. లంపాకపతిమీఁది కని చేసిన ప్రయత్నము లేక పాటలీపుత్త్రమువైపు త్రిప్పవచ్చునని యనుకొనెను.

పర్వతరాజుసేనలు కదలినవి. మగధప్రాంతమునందలి నదీతీరముల వారి పటకుటీరములు వెలసినవి.

అప్పుడే యెక్కడనుండి వచ్చిరో, నందుల వేగుల వాండ్రు పట్టువడి చంద్రగుప్తుని యెదుటికి నడిపింపఁబడిరి. చంద్రగుప్తుఁడు వారికి కొరడాదెబ్బలు తగిలించి విడిచిపుచ్చ

నట్లు భటుల నాజ్ఞాపించినాఁడు. పర్వతరాజుసైన్య మపుడే పొలిమేరలలోఁ జొచ్చుచుండెను.

ఇట రాక్షసునికి నపశకునములు దోఁచినవి. 'ఒక్కరొక్కరే వచ్చి, కిరాతు లీగ్రామమును దోఁచిరి; పారసీకు లా గ్రామముపైఁ బడుచుండిరి. సింధుపతి కొన్నియూళ్లను జిక్కించుకొన్నాఁ'డని వేగులవారు చెప్పుచుండిరి. అమాత్యరాక్షసునికి నేమియు బాలుపోవుటలేదు. "వీరందఱు పర్వతేశ్వరుని సామంతులుగదా! వీరికీ సాహస మెట్లుకలిగెను? పర్వతేశ్వరుఁడిప్పుడేల దండెత్తివచ్చును?" అని యనుకొనుచుండ నింతలో శిక్షితులైన గూఢచారులు వచ్చి "అయ్యా! చంద్రగుప్తుఁడు మా ప్రాణములు దీయలేదు. మానమును దీసినాఁడు. మమ్ము కొరడాలతోఁ గొట్టించినాఁడు. వారి సేననంతయుఁ జూచుటకు మా కేడు దినములు పట్టినది. నేల యీనినట్లు ఎక్కడఁ జూచినను సైనికులే! హుటాహుటిని స్వారిచేయుచు వచ్చితిమి" అనిరి. రాక్షసుఁడు, "ఇటీవల లంపాకపతిమీఁదికి గదా పర్వతరాజు దండెత్తునని వింటిమి. అది వట్టి బూటకమని యిప్పుడు తెలియుచున్నది" అనెను. "అది కాదు; మంత్రిశేఖరా! లంపాకపతిమీఁదికి కామరూపాధిపతిగూడ దండెత్తునని వింటిమి" అని వారు జెప్పిరి. "చంద్రగుప్తునివద్ద నింకెవరైన గలరా?" యని రాక్షసుఁ డడుగఁగా, నెవఁడో జుట్టు ముడివేసికొనక యొక బ్రాహ్మణుఁ డాయనప్రక్కటివిగాఁ గూర్చున్నవాఁడని చెప్పిరి. ఇంకను చెప్పరేమి? ఇది విష్ణుగుప్తుని మోసమని రాక్షసుఁడు భావించె. నందులకీ విషయము లన్నియుఁ దెల్పుఁడని చారుల కాజ్ఞయిచ్చెను.

రాక్షసుని బుద్ధిలో విష్ణుగుప్తుఁడు చేసిన మోస మంతయు పొడగట్టెను. "పర్వతేశ్వరుని మనపై నుసికొల్పినాఁడు; లేనిపోనివైరము కామరూపాధిపతికి లంపాకపతిపై పుట్టించినాఁడు. పర్వతేశ్వరుని కేమి యీఁసపెట్టినాఁడో!" అని యనుకొని దక్షిణదేశములందున్న సేనలన్నియు ప్రోగు చేసికొని రండని సేనాపతుల కుత్తరములు వ్రాయించి, కొందఱు మిత్రరాజులకు పర్వతరాజునగరముపై దండెత్త వలసినదని రాక్షసుఁడు కోరెను.

రాక్షసుఁ డంత నందులవద్దకుఁ బోయి, సంధి కిఁక దావులేదనియు, భేదోపాయ మొక్కటే మార్గమనియు, దానికైనను కాలము చాలదనియుఁ జెప్పెను. శత్రువు నెత్తిపైకి వచ్చి కూర్చున్నప్పుడు వారి నడ్డగించుటకై సైనికులను బంపుటయే ముఖ్యకర్తవ్యమనెను. నందు లమాత్యుని పలుకులకు సమ్మతించిరి.

అమాత్యరాక్షసుఁ డంత నేకాంతగృహములోనికిఁ బోయెను. లేఖకులతో నేమో చెప్పఁబోవుచుండఁగా జీవసిద్ధి ప్రవేశించెను. "ధర్మిష్ఠునకు శ్రేయోఽస్తు" అని కూర్చుండెను. 'మంచితరుణముననే విచ్చేసితివయ్యా క్షపణకుఁడా!' యని రాక్షసుఁ డనెను.

క్షపణకుఁ డంత నిట్లనెను.- "వనవాసమునఁ దపస్సు చేసికోవలసిన నేను మీకోసరమై మౌనమును విడిచి, మీ శ్రేయస్సునకై యిటకు వచ్చియుంటిని."

అమాత్యుఁ డంత నొక్కప్రశ్న చెప్పుమని యతని నడిగెను. అందుల కాతఁడు నక్షత్రము లెంచువానివలె వ్రేళ్లు

లెక్క పెట్టి, "మీ ప్రశ్న శత్రువులరాక, రాజ్యములోఁ గలఁత యను రెండు భాగములుగా నున్నది. మీమీఁది కెత్తివచ్చిన విరోధి ప్రాణములతో తిరిగి పోలేదు. శత్రువు మీ భేదోపాయమునఁ జిక్కి తీరును" అనెను. రాక్షసుఁ డాతని పాండిత్యమును మెచ్చుకొని, "అయ్యా! మీరు మాకడనే యుండి మాకు ప్రయోజనపడవలయు"నని కోరెను.

"లౌకిక ప్రయోజనముతో మా కేమి పని? లోక క్షేమము మావలన జరుగునేని, మీవద్ద నుండుటకు నాకు కొంతకాలమువఱకు నభ్యంతరములే" దని క్షపణకుఁడు కన్నులు మూసికొని కూర్చుండెను.

రాక్షసుని యాజ్ఞ చొప్పున భాగురాయణుఁడు తన్నాశ్రయించియున్న సిద్ధార్థకుని సహాయమున శత్రు పలాయనమునకై సరయూనదీతీరమందు జపశాలను వేయించి, అందు జపహోమాదులు జరిపింపఁ దలఁచెను.

---

## తృతీయోపాయము

పర్వతేశ్వరుని సామంతులు మగధదేశపుఁ బొలిమేరల నాక్రమించిరి గదా! కాని వారివద్ద రాక్షసుని గూఢచారులు మాఱువేసములతో నుండిరి. వారివద్దకు రాక్షసుఁడు కొన్ని జాబులను రహస్యముగా నిచ్చి రండని చారులను బంపెను. అంతట జీవసిద్ధి కన్నులు తెరచి 'మన ప్రభువునకు జయము కలుగుగాక!' యనుచుఁ బోయెను.

రాక్షసుని లేఖ లా గూఢచారుల కందరాదని యీవలకు వచ్చి జీవసిద్ధి తలంచెను. తన శిష్యుని కొక చీటి నిచ్చి విష్ణుగుప్తునకు వెంటనే యందిమ్మని పంపెను.

ఇట నవనందులు సభఁగూర్చి సేనానులతో వారి వారి యుద్ధస్థానములు చెప్పుచుండిరి. రాజపుత్రులతో 'మీ రెల్లరు వాహనము లెక్కి మాతోడ రావలయు'నని యాన తిచ్చిరి. తదుపరి వారు అమాత్యరాక్షసునిఁ జూచి "అమాత్యశేఖరా! మా శౌర్యాగ్నికి మీయాలోచనాబలము మహావాయువు వంటిది" అని పలికి తమతమ యంతఃపురము లకుఁ బోయిరి.

ఒక యాత్రికుని వేషముతో, జీవసిద్ధిశిష్యుఁ డా కాగితమును విష్ణుగుప్తునివద్దకు వచ్చి జా బందించినాఁడు. విష్ణుగుప్తుఁ డది చదివికొని చంద్రగుప్తునితో "చూచితివా, చంద్రా! రాక్షసుని భేదోపాయము! పర్వతరాజును సామం తులను చీలగొట్టవలె నని యున్నాఁడు. వర్తకులనుపేర నా సామంతులవద్ద రాక్షసుని గూఢచారు లున్నారట! ఇదిగో! ఇందుశర్మ వ్రాసినాఁడు వారిపేర్లను. ముందే యీ గడ్డి పోచలను పెల్లగించివేయవలయును. నీవు జాగరూకుఁడవై యుండుము. నే నిప్పుడే వచ్చెద" నని బయలుదేరి వెళ్లెను.

పర్వతేశ్వరునితో విష్ణుగుప్తుఁడు "రాజా! మీకును మీ సామంతులకును భేదము పుట్టించుటకై రాక్షసుఁ డీ సామంతులవద్ద వర్తకుల వేషములతో దిరుగుచున్న తన గూఢచారుల కుత్తరములు వ్రాసి పంపినాఁడు. ఈ సంగతి

తమతో విన్నవింప వచ్చితి'' ననెను. ఇంతలో ''మా బంధములను విడదీసి కొంత సీరిచ్చి, మా దప్పిని బోఁగొట్టితి రేని నిజము పలికెద' మను మనుజుల మొఱ వినవచ్చెను. వెంటనే రాజభటులు కదలి ఉత్తరములతో వారిని దెచ్చి రాజున కప్పగించిరి. వారే వర్తకులపేరఁ దిరుగుచున్న వారు. రాజు ఒక రిద్దఱికి ముక్కులుకోసి పంపివేసి, మిగిలినవారిని చెఱయం దుంపించెను.

విష్ణుగుప్తుఁడు ఇందుశర్మశిష్యునితో ''జపశాల కట్టించితి రంటివే! నందులు పురమునుండి బయలుదేరు నపుడు జపశాలలోని మనవాఁడు మంత్రాక్షత లిచ్చి హితము పల్కినట్లు నటించి, ఏదైన నద్భుత వ్యాపారమును బుట్టించి వారిని భ్రమపెట్టవలయును. మూఁడవదినమున నాల్గవ జామున పూర్ణాహుతి జరుగుననియు నందు లా సమయమున నక్కడ నుండవలయు ననియు వానిచే ననిపింపుము'' అని పంపివేసెను.

ఇంతకుమున్నే, నందులకు ప్రాణస్నేహితుఁడగు కాశీ రాజున కొక యుత్తరము విష్ణుగుప్తుఁడు కమలాపీడుని చేతి కిచ్చి పంపెను. కాశీరా జా యుత్తర మందుకొని పర్వతేశ్వరుఁడు తన సహాయము కోరుచు వ్రాసినదానిని జదువుకొని, రాయబారితో సమాధానము రేపు దెల్పెద ననెను. ఆ రాయబారి నక్కడనే యుంచి, కాశీరాజు నందులకు తత్క్షణమే యొక జాబు వ్రాసెను. ఈ సంగతి కమలాపీడుఁడు కనిపెట్టెను. రాక్షసుఁడు కాశీరాజు పంపిన జాబును జూచి యాశ్చర్యపడి నందులతో నిట్లనెను. ''పర్వతరాజు మన భేద

తంత్రమును గుర్తింపలేను. పైగా మనకు మిత్రుఁడగు కాశీ రాజును సాయము వేఁడుచున్నాఁడు'' అని వేఱుగా నొక జాబును కాశీరాజుదూతల చేతి కిచ్చి, వారిని బంపివేసెను. వా రది తీసికొని పోయి తమ రాజున కిచ్చిరి. అం దిట్లున్నది.

“మేము సేనాసమేతముగ వచ్చి మీకు సాయపడుదు మని పర్వతేశునికి వ్రాయుఁడు. నిజమనుకొని పర్వతరాజో, వాని కుమారుఁడో, లేక చంద్రగుప్తుఁడో మిమ్ములను కలిసి తీసికొనిపోవుటకు వచ్చును. వారిలోఁ జంద్రగుప్తుఁ డున్న వెంటనే సంహరింపుఁడు. తక్కిన వారైనచో కట్టి మా వద్దకుఁ బంపుఁడు.''

అట్లే కాశీరాజు కమలాపీడుని బిలిపించి సరేయని మీ రాజుతో జెల్పుమని పలికెను. కమలాపీడుఁ డా విషయమును, కాశీరాజు నందులతో సంప్రతించిన విషయమును పర్వతరాజు నకు కబురంపి, తాను మాత్రము, 'మా రాజు వద్దనుండి సమాధానము వచ్చును. ఇదిగో అదిగో' యనుచు, వా రేమి చేయుదురో యని యక్కడనే కనిపెట్టుకొనియుండెను.

---

## నీటి బుడగ

ఇందుశర్మశిష్యుఁడు విష్ణుగుప్తునివద్దనుండి వేగముగా జపశాలకు వచ్చెను. అందలి జపకర్తతో విష్ణుగుప్తుఁడు చెప్పి పంపిన దంతయుఁ దెలిపెను. అటనుండి యా శిష్యుఁడు జీవసిద్ధియొద్ద కేగి మాటలాడెను.

భేదోపాయపత్రములను దీసికొనిపోయి, పట్టువడిన వేగులవాండ్రను గూర్చియు, వర్తకవేషధారులయిన చారులు చెఱలో నుంపఁబడిన సంగతియు, ముక్కులు తెగి వచ్చిన యిరువురు చారులవలన రాక్షసుఁడు దెలిసికొని, "ఈ లేఖలను నేను వ్రాయించినప్పు డొక్కక్షపణకుఁ డిక్కడ నుండెను. ఆ క్షపణకుఁ డెట్టివాఁడో!" అని గూఢచారులతో వాని గుణములు పరీక్షించుఁడని నియమించెను.

విష్ణుగుప్తుని బుద్ధిబలమువలన నడుపఁబడు శత్రువుల బలమును గూర్చియు నందులయదృష్ట మెట్లుండునో యనియు నాలోచించుచు నందులవద్దకు రాక్షసుఁడు వచ్చెను.

ఇట క్షపణకునిఁ బరీక్షింపవచ్చిన భటులలోనొక్కఁడు పురము వెలుపల నొక తిన్నెపైఁ బండఁగొట్టినట్లు చలింపక కూర్చుండియున్న క్షపణకుని దూరమునందే చూచి, 'వీఁ డెక్కడఁ దిరుగును? వీఁడు చేయు పని యెట్టిది? వీని యొద్దకు వచ్చిపోవువా రెవరు?' అనునట్టి విషయములఁ దెలిసికొనఁగోరి దాఁగియుండి చూచుచుండెను. ఒకటి రెండు దినములా క్షపణకుఁడు కొయ్యవలె కదలక మెదలక యన్నపానము లపేక్షింపక కూర్చుండుటను జూచి, "ఇతఁడు గొప్ప యోగివలె నున్నాఁడు. అయినను, నేను వీనికి శిష్యుఁడనై యీతని స్వభావమును దెలిసికొనెదను" అని తా నొక బౌద్ధునివలె మాఱువేసముపూని యతని యొద్దకుఁ బోయి ప్రదక్షిణ నమస్కారములు చేసి చేతులు మోడ్చి

యతని యెదుట నిలుచుండెను. క్షపణకుఁడు వానిని జూచి 'కూర్చుండు' మనియు, 'నెక్కడికి వచ్చితి?' వనియు సైఁగఁ జేసెను. అందులకు వాఁడు "గురూత్తమా! సంసారాగ్నిలోఁ బడి వేఁగలేక తమ పాదకమలముల నాశ్రయించితిని. మానము విడనాడి తత్త్వ ముపదేశింపుము" అని యతని పాదములఁ బట్టుకొని విడువకుండెను.

అప్పుడు వాని నొసటనున్న బొట్టును జూచి, "వీఁడు బౌద్ధుఁడు కాఁడు; వీఁడు రాక్షసుఁ డంపఁగా వచ్చిన వేగుల వాఁడు. కావున వీనికి తగిన శాస్తి చేసి సాగనంపవలయును" అని తలపోసి మానము విడిచి, "అయ్యా! నీ దే సంప్రదాయము?" అని ప్రశ్నింపఁగా, వాఁ డేమి చెప్పుటకుఁ దోఁచక తడఁబడెను. దానిని గని క్షపణకుఁ డేమియు నాక్షేపింపక, వాని తల గొరిగించి, "పూటపూటకు మేము కూర్చున్న పీఠమునకు ముమ్మారు ప్రదక్షిణముచేసి నమస్కరించుచు, దిగంబరుఁడవై బిచ్చమెత్తికొని వచ్చి తినుచు మెలఁగు చుండుము. త్వరలోనే నీ మనస్సు పక్వమగు" నని చెప్పెను.

ఆ చారుఁ డిన్ని యవస్థలకు విధిలేక లోఁబడి తనకుఁ దటస్థించిన దుర్దశకు మిగుల దుఃఖించెను. నగ్నుఁ డగుటచే నూరిలోఁ బ్రవేశింప సిగ్గుపడి దాపుననున్న యడవికిఁ బాఱిపోయి చీకటిపడువఱ కచట దాఁగియుండి, యెట్టెట్టులోఁ దన యిల్లు చేరెను. తనకుఁ దటస్థించిన దుర్గతి నితరులతోఁ జెప్పికొనుటకును లేక, రాక్షసునికడకుఁ బోయి, "స్వామీ! క్షపణకునిఁ బ్రత్యక్ష పరోక్షములందు నేను బాగుగాఁ

బరీక్షించితిని. ఆతనియెడ నెట్టి మోసప్రవృత్తియు గోచరింపలేదు. అతఁడు మహాయోగి'' యనెను. అంత రాక్షసుఁడు క్షపణకునియెడ సందేహము మాని తన పనులు చూచికొనుచుండెను.

అట పర్వతరాజు, నందులసైన్యము సమీపించి వచ్చుట దెలిసికొని వేఱొకదారిని దనసేనలను బంపి, పాటలీపురముఁ బట్టుకొన నిశ్చయించి, వీరసామంతులను రావించి, 'శూరవర్యులారా! శత్రుసేన దగ్గఱించుచున్నది; బుధవారము రాక్షససమేతులై నందులు స్కంధావారమునకు వచ్చెదరు; నాటిరాత్రి, పాటలీపురమునకు మన సైన్యములు తరలి, పట్టణము నలువైపులను ముట్టడింపవలయును. తక్కిన సైనికులు నందులను మార్కొని సంగరము సలుపవలయును'' అని యానతిచ్చెను. రాజులెల్లరు నాతని యానతి చొప్పుననే సేనాసమేతులై వెడలుచుండిరి.

---

## శత్రుపలాయన జపశాల

అట్టియెడ నందులు యుద్ధమునకై మూలబలములతో యమాత్యరాక్షసునితోడఁ దమకై యేర్పఱచియున్న శిబిరము వంకకు వచ్చుచుండిరి. వారు జపశాలను జూచి, 'ఇదేమి?' యని యడుగఁగా, భటులు, ''ప్రభువులారా! ఇది రాక్షసామాత్యుని యానతిచేఁ గల్పింపఁబడిన శత్రుపలా

యన జపశాల; అచ్చట జపముసేయు విప్రవరులు మంత్రా క్షతలను గొని మీ సందర్శనమునకై వచ్చి నిలిచియున్నారు" అనిరి. నందు లా బ్రాహ్మణులను జూచి, "మంత్రజ్ఞులారా! సంపూర్ణముగ జపహోమములు జరుపుడు. ఇప్పుడు, మీఁదికి వచ్చుచున్న శత్రువులు వెన్నుజూపుకు రేని మీకు శాశ్వత మైన స్థితులు గల్పించెదము" అనిరి. అంతలో నేలపై వ్రేలాడు జడలతో చేతిలో జపమాలిక యొప్పుచుండఁగా, యోగదండమును, కృష్ణాజినోత్తరీయమును దీపించుచుండ, వచ్చుచున్న యోగీశ్వరునిఁ జూచి, నందాదులు దమతమ వాహనములనుండి దిగి, 'ఆ వచ్చువా రెవ్వ?' రని యడిగిరి.

అప్పు డాతనిశిష్యులు, "మహీపతులారా! యీ దారిని దమ యాశ్రమమునకుఁ బోవుచు, ధర్మనిరతులైన నందులకు శత్రువులవలని బాధ కలుగనట్లును, హోమాదులు చేయు చున్న యీ మహానుభావులను మౌనోపవాసి యందురు" అనిరి. ఆ మాటలకు నందులు, 'స్వామీ! మీకు మౌన వ్రత మేమో! అయినను మే మడుగవలసిన యర్థ మొకటి గలదు. శత్రువు లెన్నఁడు పలాయితు లగుదురు?" అని ప్రశ్నించిరి. ఆ మాటలకు మౌనోపవాసి, "భూపతులారా! సామాన్యజనులతో వాదవివాదములు లేకుండగనే మేము మౌన మూనుట; మీవంటి ప్రభువులయెడ మౌన మనునది గలదా! శుక్రవారము ప్రదోషకాలమున హోమ పూర్ణా హుతి యగును. అప్పుడు శత్రు వోడిపోవు కొన్ని సూచన లగుపించును. హోమకుండమందు దేవతాహస్తము గోచరించును. పుణ్యాత్ములకేకాని యన్యుల కాదర్శనము

గలుగదు" అనెను. అందుల కా రాజులు, "మునివర్యా! ఆ దేవతాహస్త సందర్శనమునకు మేము రావచ్చునా ?" అనిరి.

మాసోపవాసి– "మహీశులార! కుతూహలమున్న చో దేవతా సందర్శనమునకు కొద్దిపాటి పరివారముతో మీ రెల్లరువచ్చి దర్శించి ప్రసాదము గ్రహింపవచ్చును. తరువాత శత్రువులు నొక జాము కాలములోపల హతులగుట సిద్ధము. నాలుగు దినములలో శత్రుసేనయు నాశ మొందును. ఇది సత్యమని భావింపవలయును" అనెను.

నందులు మాసోపవాసి మహావిరక్తుఁడని తలపోయుచు నతనిశిష్యులను జూచి "మునిశిష్యులారా! పూర్ణాహుతి సమయముఁ దెలిసి మాకుఁ జెప్పవలయు" ననిరి. అందులకు వారు "మహీపతులారా! ఆనతిచొప్పునఁ జేసెదము. ఈ జపశాల చుట్టుప్రక్కల మనుష్యులు లేకుండునట్లు సేయుఁడు" అని విన్నవించిరి. నందు లటులే చేసెద మని వారితోఁ జెప్పి తమకై నిర్మించియున్న గుడారములలోఁ బ్రవేశించి రాజ భోగము లనుభవించుచుండిరి. వారివలెనే సైనికులును విశ్రమించి తమ తమ పనులు చూచుకొనుచుండిరి.

---

## నందుల యుద్ధయాత్ర

పాటలీపుత్రమునఁ బౌరులు పగవా రెత్తివచ్చుటను గూర్చి కల్లోలపడి తల కొక విధముగా మాటలాడుకొనఁ జొచ్చిరి. మాసోపవాసి నందులను జపశాలయొద్దకు వచ్చునట్లు నియమించిన సంగతిని విష్ణుగుప్తునితోఁ జెప్పుటకు

జీవసిద్ధి శిష్యుని బంపెను. ఇట్టి తరుణమందు జీవసిద్ధిశిష్యుఁడు సిద్ధార్థకుఁడు, "రేపు నందులకును పర్వతేశునకును యుద్ధము జరుగఁబోవుచున్నది; నందులకు నతనిసేనానులకు భేదము గల్పించుట యిప్పుడు నేను జేయవలయును" అని తలపోసి, భాగురాయణునొద్దకుఁ బోయి, "అయ్యా! నీకు నేను హితుఁడను గదా! ఒక్క ముక్క చెప్పి పోదమని వచ్చితిని. నందులకు రాక్షసునివలెఁ దనకు నీవని చంద్రగుప్తుఁడు విశ్వసించియున్నాఁడు. నీ యుపకారమువలననే తా నిట్టిదశకు వచ్చినట్లును జెప్పికొనుచున్నాఁడు. నీయెడ నతని కున్న విశ్వాసమును దృఢపఱచుకొనుట కిదియే తరుణము. నేఁటి రాత్రి యుద్ధము సమీపమందు జరుగుటే యిందులకు నిదర్శనము" అని చెప్పెను. ఆ మాటల కతఁడు, సిద్ధార్థకుఁడు చంద్రగుప్తున కాప్తుఁడని నమ్మి, "అయ్యా! చంద్రగుప్తునకు మేము హానిచేయువారము గాము. మే మతనికి రహస్యముగాఁ జేయు సాహాయ్యము ముందు ముందు తెలియును" అనెను. భాగురాయణాదు లేమి చేయఁదలఁచిరో!

ఆ సమయమున విరోధిసైన్యములు నందసైన్యములను దాఁటి, సామంతరాజ బలములను జెల్లాచెదరు గావించి, కారుమబ్బులు క్రమ్ముకొని వచ్చినట్లు వచ్చుచుండెను.

---

# రాక్షస యుద్ధము

అట్టియెడ రాక్షసుఁడు ప్రళయకాలరుద్రుఁడో యన శత్రుబలములపైఁ బడి యుద్ధముసేయుచు, శత్రుసేనలను తునాతునియలు చేయుచుండెను. ప్రతి ద్వారము నొద్దను బ్రతాపవంతులగు సామంతరాజుల నిలిపి, యెచ్చటఁ జూచినను దానయై విజృంభించుచు రాక్షసుఁడు పోరు సలుపుచుండెను.

అప్పుడు శత్రుసేనలోని భటులు, 'ఇతఁడు ప్రళయరుద్రునివలె నున్నాఁడు!' అని యాతని ధాకకుఁ దాళక తెల్లఁ బోవుచుండఁగా, రాక్షసుఁడు వీరవిహారము చేయుచుండెను. ఆతని ప్రతాపమున కాఁగలేక హతశేషులు పలాయన మంత్రము పఠించుచుండిరి. తరువాత రాక్షసామాత్యుఁడు పట్టణమునకు మరలిపోవుచు, దారిపొడుగునను చచ్చిపడి యున్న తమ సైనికులను గాంచుచుఁ బోయిపోయి నగరముఁ బ్రవేశించెను.

ఇంతలో రాక్షసునిధాక కాఁగలేక పాఱిపోయిన భటులు ఏనుఁగులకు కన్నులుకట్టి పెద్ద కేకలు వేయుచు నంకుశములతోఁ బొడుచుచుఁ దఱిమిరి. అవి యన్నియు వేగముగఁ బరుగులిడుచు వచ్చి యా పురి యగడ్తలో దబీలు దబీలుమని కూలినవి. ఆ విధమునఁ గూలి పూడిన యగడ్తపై శత్రుసేనలు ధారాళముగ నడచిపోయి ప్రాకారముఁ బట్టుకొని నిచ్చెనలతో బురుజులపై కెక్కి జయభేరుల మ్రోగించుచుఁ బర్వతేశ్వరుని ధ్వజము స్థాపించినవి. ఆ సంగతి

విని యమాత్యరాక్షసుఁడు మండిపడుచు ద్వారమునొద్ద నిలిపియున్న సైన్యముతో వచ్చి ప్రాకారముపై కెక్కి కనబడిన పగవాని తల నఱికి, వాని ధ్వజమును గూల్చెను. పిదప దన యశ్వమును దిగువకు దూఁకించి, విరోధులపైఁ బడెను. శత్రువు లతని శౌర్యమున కాఁగలేక "ఇతఁ డమాత్య రాక్షసుఁడు కాఁడు; ప్రత్యక్ష రాక్షసుఁడే" యని పాఱిపోయిరి. అట్టియెడ రాక్షసుని సైన్యము పగవారిని వెన్నంటి తఱుముచు, శత్రువులకు భయంకరముగ జయభేరుల మ్రోఁగించెను. రాక్షసుఁడు, శత్రుసైన్యములు దూరముగా బాఱిపోయె నని తెలిసి రాజద్వారమును జాగ్రత్తతోఁ గాపాడుటకు సైనికులను నియమించి, సూర్యోదయ మగుచుండఁగా యుద్ధశ్రమమునుగూడఁ బాటింపక నవనందు లున్నచోటికి వచ్చెను.

అప్పుడు వారు, "అయ్యా, అమాత్యశ్రేష్ఠా! గొప్ప కార్యమును నిర్వహించితిరి. మీరుండఁగా మాకు శత్రులెవ్వరు? ఈ పర్వతరా జెంతమాత్రము?' ఇఁక మీరు విశ్రమింపుఁడు; శత్రువులు వచ్చిరేని మేమే యెదుర్కొని పోరెదము" అనిరి.

రాక్షసుఁడు, "ప్రభువులారా! కార్యము తుద కెట్లు ముగియునో? కావున విరోధులమీఁదికి నేనే వెళ్లెదను. మీరు నాకు వెన్నుబలముగ నిలిచినఁ జాలును" అనెను. అందులకు వారు సమ్మతించి "అమాత్యవర్యా! మన సైనికులలో, వారి మనోభావములను గుర్తెఱిఁగి తగినవారి నాయా స్థానముల నిలిపి వ్యూహము రచింపుఁడు. సామంత

రాజులను ప్రేరేపించి పగవారిమీఁదికిఁ బంపుఁడు. యుద్ధమునకు వెనుదీసిన ద్రోహులను వధింపుఁడు'' అని రాక్షసున కానతిచ్చిరి.

ఆ మాటలకు రాక్షసుఁడు సమ్మతించి, వ్యూహరచనమునకు సేనాపతులను నియమించి పంపి, యుద్ధమునకు వెనుదీసినవారిని ఘోరముగ దండించెను. అప్పుడే సూర్యుఁడుదయశిఖరము నలంకరించుచుండెను.

ఆ సమయమున నందులు రాక్షసునివెంట నేనుఁగులపై కదలిరి. శత్రుసైన్యము లెదురొ్కన వచ్చుచుండినవి. ఉభయబలములకును సంకులసమరము ఘోరముగ జరిగెను. భటులు రెండుపక్షములందును గూలుచుండిరి. రక్తము కాల్వలు గాక నదు లగుచుండెను. రెండు సేనలయందును బలము లర్ధభాగము హతమయ్యెను. సూర్యుఁ డస్తమింపఁ బోవుచుండెను. అట్టియెడ నుభయసైన్యములలోని రాజులు తమ సేనానులం జూచి —

''శూరులైన సేనాధిపతులార! ఇప్పుడు యుద్ధము నిలుపుఁడు; సైనికులు విశ్రమింపనిండు; రేపటికి చూచుకొందము'' అనిరి.

నందులు స్నానాదికృత్యములాచరించి యుద్ధమునకు సంబంధించిన సంభాషణలు సలుపుచు విశ్రమించిరి. రాక్షసుఁడు, స్నానసంధ్యాది కృత్యముల నిర్వర్తించి కర్తవ్యమునుగూర్చి తలపోయుచుండెను. అట్టియెడ చారుఁడొకఁడు వచ్చి మ్రొక్కి, ''స్వామీ! అమాత్యశేఖర!

దక్షిణదిక్కునను సైన్యములు నాలుగామడల దూరమున నున్నవి. ఇఁక రెండు మూఁడు దినములలో వచ్చి చేరును'' అని విన్నవించెను. ఆ మాటలకు రాక్షసుఁడు సంతసిల్లి, ''ఓరీ! ఆ సేనలు త్వరగా పురసమీపమునకు వచ్చునట్లు వర్తమాన మందింపుము'' అని సెలవిచ్చి పంపి, నందులున్న యెడకు వచ్చుచుండఁగా, ఇరువురు దూతలు రాక్షసుని సమీపించి ''మేము శూరసేన దశార్ణదేశాధీశుల యొద్దకుఁ బోయియుండిన చారులము. ఇవిగో వారిచ్చిన నిరూపణము'' లని తాము దెచ్చిన యుత్తరము లిచ్చి, ''స్వామీ! దశార్ణ శూరసేనాధిపతులు మీ యానతిచొప్పున సైన్యసమేతులై పర్వతరాజ్యము పైకి దండెత్తి కదలి రెండు ప్రయాణము లైన పిదప వ్రాయించి యిచ్చిన లేఖ లివి. వారి యుత్సాహముఁ జూడఁగా నీపాటికే పర్వతరాజ్యము లోఁబఱచికొని యుందురేమో!'' అనిరి. ఆ మాటలకు రాక్షసుఁడు మిగుల సంతసిల్లి నందులయొద్దకుఁ బోయెను.

''కుమారులారా! నిన్న మొన్నటి సంగ్రామములలో నుభయసైన్యములయందును సగము కూలి సమ యుద్ధ మయ్యెను. శత్రువులు కదలునట్లు లేరు. అటులే యైనచో జయాపజయము లెట్లు పరిణమించునో? కావున, ఇప్పుడు కపటసంధి యావశ్యకము. ఇప్పుడు దశార్ణశూరసేనాధిపులు పర్వతరాజ్యములో నున్నట్లు తెలిసినది. ఇఁక పర్వత రాజునకుఁ గ్రొత్తసేనలు రావు. మనకును రెండుమూఁడు దినములలో దక్షిణమునుండి బలములు వచ్చి చేరి, సైన్య మధికమగును. కాఁబట్టి, యుద్ధమును జాలించి రెండుమూఁడు

దివసములవఱకుఁ గాలయాపనము సేయవలసియున్నది. పిదప సైన్యసంపద మిక్కుటముగఁ గల మనలను పర్వతేశ్వరుఁడు జయింపలేక హతుఁడగును; సంధి యను మిష పెట్టి కాల హరణము చేసితిమేని, మేలు కాఁగలదు. ఇంతలో కాశీరాజు ముఖమున యత్నము కొంతవఱకుఁ గొనసాగవచ్చును'' అని, విష్ణుదాసుఁడను నియోగిని బిలిచి రహస్యముగ వానితోఁ గొన్ని మాటలు పలికి పర్వతేశునొద్దకుఁ బంపెను.

ఆ సమయమున క్షపణకుని శిష్యుఁడు విష్ణుగుప్తు నొద్దకువచ్చి 'రేపు సాయంసమయమున నందులు జపశాలకు విచ్చేయునట్లు నిర్ణయింపఁబడిన' దని మాసోపవాసివాక్యము లను దెలిపెను. అప్పుడు విష్ణుగుప్తుఁ డొక సేనాధిపతిని బిలి పించి, ''అయ్యా! ఉభయసైన్యములయం దర్ధభాగము హత మయ్యెను; నందులలో నొక్కఁడును చెదరలేదు. కావున, మరల యుద్ధమైనచో ఫలిత మెటులుండునో! నీవు నీ సైన్య మందు శూరులై విశ్వాసపాత్రులై వెలయు నిరువదివేల రౌతు లకుఁ గాశీదేశపుసైనికులవలె వేసము వేయించి యుద్ధసన్నద్ధు లను జేసి, కాశినుండి పాటలీపురమునకుఁ బోవు మార్గమున నిలిపి యుంచుము. ఈ రాత్రియే యీ కార్యము జరుపుము. రేపు మా యానతి చొప్పున నడచుకొనునట్లు నియమింపుము. వారిలో బుద్ధిసూక్ష్మతగల యాగ్గురు రౌతులను మాయొద్ద నిలుపుము'' అని పంపివేసెను. ఆ సేనాపతి విష్ణుగుప్తుని తంత్రమున కాశ్చర్యపడుచుఁ బోయి యతఁడు చెప్పినటులే తనసేనలో నిరువదివేలమంది నేర్పఱచి, కాశీరాజ భటుల వలె వారిని విభూతి రుద్రాక్షలచే నలంకరించి, యా యాశ్వి

తులను విష్ణుగుప్తుఁడు చెప్పిన స్థలమున నిలిపెను. వారు తమ సేనాని చెప్పిన చొప్పుననే నడచుకొనిరి.

---

## పర్వతేశ్వరుని వైమనస్యము

అప్పుడు పర్వతరాజ్యమునుండి యిద్దఱాశ్వికులు హుటాహుటిని వచ్చి పర్వతరాజును దర్శించి మ్రొక్కి "మహారాజా! పరరాజులు మన రాజ్యముపైఁబడి కొల్లగొట్టుచున్నారు. అందున్న మన వీరులు పగవారితో ఘోరముగఁ బోరుచున్నారు. మన నగరమునకుఁ దప్పక ముప్పుకలుగునట్లున్నది" అని తాను దెచ్చిన యుత్తర మతనికిచ్చిరి. రాజు దానిని జదివి, "దశార్ణశూరసేనాధిపతులు పర్వతరాజ్యముపైఁ బడి ఘోరసంగ్రామము చేయుచున్నారు. మీరు నందులతో సంధిగావించుకొని యిటకు రారేని మన రాష్ట్రము రక్షించుట యశక్యమగును" అని పురరక్షకుఁడు వ్రాసి పంపిన యభిప్రాయమును దెలిసి యాలోచించుచుండఁగా, నిద్దఱు చారు లతిత్వరితముగ వచ్చి పర్వతేశ్వరునకు మ్రొక్కి "భూమీశా! నందరాజులకుఁ దోడుగా వచ్చి చేరిన దక్షిణదేశ బలములు సమీపభూమి నావరించుకొన్న" వని చెప్పిరి. ఏమియుఁ దోఁచక, రాజు శబరవర్మను రావించి కర్తవ్యమునుగూర్చి యాలోచించుచుండగా, రాక్షసుఁడంపిన దూత యటకు వచ్చి పర్వతేశుని సందర్శించి యిట్లనెను.

"పర్వతేశ్వర మహారాజా! సార్వభౌములైన నందులు మీ కుశల మడిగిరి. శూద్రస్త్రీమనుముఁడయిన చంద్రగుప్తుఁడు దాయాదివిరోధముచే మిమ్మాశ్రయించి మిమ్మిటకుఁ దెచ్చుట

జరిగినది. మాకును మీకు నేకాలమందు లేని ద్వేష మీ చంద్రగుప్తునివలన కలిగెను. అల్పు నుద్దేశించి యింతటిపనికి దిగితిరి. కావున నెక్కువ నష్టము కలిగెను. ఇప్పటికైనను గర్తవ్య మాలోచించి చంద్రగుప్తుని మా కప్పగింతురేని చంద్రగుప్తుఁడు మీకిచ్చునది మేమే యీయఁ గలము. 'వృథాయాసముచే ఫలమేమి?' అని మీతో విన్నవించి మీ వచనములను విని రమ్మని యాజ్ఞాపించుటచే మీ సన్నిధానమునకు వచ్చితిని'' అనెను.

అది విని, రాజు తన చింతలను మాటుపఱచి, యిట్లనెను— ''అయ్యా! చంద్రగుప్తుని మిషతో నెత్తివచ్చిన వారముగాము. శరణుజొచ్చిన చంద్రగుప్తున కభయమిచ్చు టచే, యుద్ధముచేసి యాతని రాజ్యభాగ మాతని కిప్పింప వలయు నని వచ్చితిమి. రాజ్యకోశములయం దర్ధభాగము చంద్రగుప్తున కిచ్చుటకు మీ కొప్పుదలయైనచో యుద్ధము నిలిపెదము. ఈసంగతి మీ రాజులకుఁ దెలుపుము'' అని పంపివేసెను. పిమ్మట, శబరవర్మను జూచి తమ యప్పటి సంగతిసందర్భములఁ దెలిపి, నందులతోడి సంధియే యుచిత మని చెప్పెను. శబరవర్మ యతని మాటలు విని, ''మహా రాజా! మీరు చెప్పినది తగియున్నను విష్ణుగుప్తునకుఁ దెలిపి, తమకు నచ్చినట్లు చేయుఁడు'' అని విన్నవించెను. పర్వతేశ్వరుఁడు విష్ణుగుప్తుని రావించి యిట్లనెను.

''అయ్యా! విప్రోత్తమా! ఇప్పుడు నందుల రాయబారి యిటకు వచ్చి యిప్పుడే వెళ్లెను'' అని వాఁడు చెప్పినదెల్ల నతనికిఁ జెప్పి తా నందుల కొసఁగిన ప్రత్యుత్తరమును దెలిపి,

"మొన్న రేయి జరిగిన రణమందు మన కపజయమును వారికి జయమును గలిగెను. నిన్నటి యుద్ధము సమముగ ముగిసెను. మరల యుద్ధ మారంభమగునేని జయాపజయము లెటు లుండునో! ఇప్పుడు సంధి యనుమాట వారివలననే పుట్టెను. దీనికి మన మొప్పితిమేని, వారివలనఁ గొన్ని దేశకోశములు లభింపవచ్చును; వానికిఁ జంద్రగుప్తు నధికారిని జేసి, వారిలోని వైరము మానిచి యశస్సునకుఁ బాత్రులమై మా దేశమునకు మేము మఱలవచ్చును; దీనిం గూర్చిన మీ యాలోచన మానతిండు."

ఆ మాటలకు, విష్ణుగుప్తుఁడు పకపక నవ్వి, 'భళిరా! కపటరాక్షసా! నీవంటిమంత్రి యెవనికిఁ గలఁడో వానికి సంపదయందును శౌర్యమునందును కొఱఁత గలుగునా? కావుననే నందులు చక్రవర్తు లనిపించుకొనిరి. నీ కుట్రలు నా యెడఁ గొనసాగవు సుమా!' అని యనుకొనుచుఁ బర్వత రాజును జూచి, "మహారాజా! లోకమున బలహీనులు బలాఢ్యులఁ బ్రార్థించుట గలదు. బలాఢ్యులు బలహీనులఁ బ్రార్థించినచో నది మోసమో, సత్యమో యూహింపుఁడు. మొట్టమొదట జయము వారికే కలిగెను. అట్టివారు, మనతో సంధిప్రయత్నము లేల చేయవలయును? రాక్షసుఁడు బలములు సేకరింపఁగోరి కాలహరణము సేయు నిమిత్తముగా నిట్టి పన్నుగడఁ బన్నెను. ఇది యిట్లుండనిమ్ము. మీ రట్లున్నారేమి?" అని విష్ణుగుప్తుఁ డడిగెను. అంతల కతఁడు "విప్రోత్తమా! రాక్షసుని కుట్రచేఁ బూర్వశత్రువులు దశార్ణశూరసేన దేశాధీశులు మా దేశముపైఁ బడి రాజ్యము

కొల్లగొట్టుచున్నారు; అచ్చటనున్న సైన్యమిటకు రాను వీలు లేనట్లు పోరు ఘోరముగ జరుగుచున్నది. ఈ వర్తమాన మిప్పుడే యందుండి వచ్చిన భటులు తెలిపిరి. నందులకుఁ దోడ్పాటుగ దక్షిణదేశములనుండి యమితబలములు వచ్చి విడిసియున్నవి. ఇట్టియెడ మనసైనికులఁ బర్వతదేశమున కంపుట యత్యావశ్యకము. నందులతోఁ బోరుసలుపుట యత్యంతావశ్యకము. ఇట్లు తటస్థించియున్న యిన్ని కార్యములకు నొక్క సైన్యమే యెటు లుపయోగించును? ఇట్టి యాలోచనవలననే రేయెల్ల నిద్రపట్టదయ్యె" ననెను.

విష్ణుగుప్తుఁడు—"మహాప్రభూ! పొగమంచునకుఁ గులపర్వతము గరఁగిపోవలసినదేనా? ఇపుడు నీదేశమునకుఁ దోఁచిన కష్టము తప్పునట్లు నేను జెప్పు విధమున నొక లేఖ వ్రాసి నీ పురరక్షకునకుఁ బంపుము. 'మన రాజ్యమునకును బురమునకును శత్రువులవలన నాటంకము గలిగెనని వ్రాసియుంటివి; ఇచట, నిన్న జరిగిన యుద్ధములో నవనందులు హతులైరి. పాటలీపురము మాకైవసమాయెను. అమాత్యరాక్షసుఁడు పాఱిపోయెను. ఎంత వెదకిన నిచ్చట నతఁడు దొరకఁడయ్యెను. మన ప్రాంతములయం దెచ్చటనైనను మాఱువేషమున దాఁగియుండిన గుట్టు తెలిసి చెప్పునట్టివారికి లక్షలధనమును గ్రామముల నొసఁగి యా రాక్షసుని చెఱయం దుంచుమనది. మన దేశములయందును పట్టణముల యందును జయభేరిలు మ్రోగించి యుత్సవములు చేయింపుము. ఇంటింటఁ జక్కెరను బంచిపెట్టుము.' ఈ విధమున నీవు లిఖించి పంపినచో నీ సంగతులే విరోధులకును దెలిసి

పరరాజులు భీతిల్లి పాఱిపోవుట సిద్ధము” అనెను. ఆ మాటలు రాజు విని, “అయ్యా! అది సరే కాని, యిప్పుడు దక్షిణ దేశమునుండి నందులకుఁ దోడ్పడ వచ్చిన సైన్యములమాట యేమి ?” యనెను. అందులకు విష్ణుగుప్తుఁడు, “రాజేంద్రా! దక్షిణదేశ సైన్యములు గూడ పాఱిపోవుసంగతిని వినఁగలవు” అని పలికెను.

అప్పుడే యిరువురు చారులు వచ్చి రాజునకు మ్రొక్కి “స్వామీ! కామరూపాధిపతియొక్కయు, లంపాకేశుని యొక్కయు సేనలకు మహాయుద్ధము సంభవించి లంపాకపతి సైనికులు కకావికలయిరి. ఆ రాజు ఖిన్నుఁడై కామరూపాధిపతిని సంధి గోరుచున్నవాఁడు” అని విన్నవించిరి. “ఈ లాభము విష్ణుగుప్తునివలననే కదా గలిగె” నని భావించుచు పర్వతరాజతనిముఖ మవలోకింపఁగా విష్ణుగుప్తుఁడు, “అయ్యా! జయాభిముఖుఁడవైన మహారాజా! ఇది యొక సంతోషవార్త యా? శేఖరునకు సర్వసైన్యాధిపత్య మొసఁగి నా యొద్దకుఁ బంపుము” అని యాస్థానమును విడిచి తా నున్న విడిదికిఁ బోయెను.

---

## విష్ణుగుప్తుని కార్యనిర్వాహము

తదనంతరము, విష్ణుగుప్తుఁడు స్నాన సంధ్యానుష్ఠానము లాచరించి, శేఖరుని రాఁక కెదురు చూచుచుండెను. అచ్చట స్కంధావారమునందుఁ బర్వతేశ్వరుఁడు శేఖర సేనాపతిని రావించి సగౌరవముగ సైన్యాధిపత్యమొసఁగి, “అయ్యా! నీవు విష్ణుగుప్తునొద్దకుఁ బోయి యతఁడు చెప్పు

నట్లు సేయుము" అని యానతిచ్చెను. అతఁ డటులే చేసెను.

విష్ణుగుప్తుఁడు శేఖరునిఁ జూచి, "ముఖ్యసేనాధిపా! రూపమునందు మలయకేతువున కీడైనవాని నొకనికి రాజార్హములైన వస్త్రభూషణాదు లలంకరించి, గజారూఢునిఁ జేసి పరివారసమేతునిగాఁ గాశీమార్గమందు నిలిపియున్న సేనలయొద్ద కీ రాత్రియే పంపి యీ విధమున మెలఁగునట్లు చెప్పుము" అని నియమింపఁగా నతఁ డటులే చేసి వచ్చెను. పిమ్మట, విష్ణుగుప్తుఁడు తనయొద్దనున్న యార్గురాశ్వికులలో నిరువురను బిలిచి, "నేఁడు నందులు జపశాలకు వచ్చిన పిదప వారియొద్దకుఁ బోయి యిట్లు పలికి యచ్చటనే కనిపెట్టికొని యుండుఁ"డని పంపెను. మఱి యిరువురను బిలిచి, నందులతో నివ్విధముగఁ జెప్పుఁడని యానతిచ్చి పంపి, తక్కిన యిరువురిని రావించి, "మీరు కాశీమార్గముననున్న సేనతోఁ గూడి నందులు జపశాలకు వచ్చినవర్తమానమును శేఖరుని సంకేతమును దెలిసిన పిదప నిట్లు సేయుఁ"డని రహస్యముగఁ గొన్నిసంగతులను బోధించి పంపివేసెను. ఆ పిమ్మట శేఖరునిఁ జూచి, "సేనానీ! నందులు జపశాలకు వెడలిన వర్తమానము కాశీమార్గముననున్న సైనికులకుఁ దెలియునట్లు జెండాలిచ్చి గాలుల నుంచె నిలుపుము. నందులతోడి యుద్ధమునకు ముందే జయభేరీ మ్రోఁగింపుము. జపశాలయందు దగ్ని తీవ్రమయినప్పుడు మన సైనికు లెల్లరు నందుల సేనలపైఁ బడి తఱుమునట్లు నియమింపుము; అప్పుడప్పుడు జరుగు సంగతులను మాకుఁ దెలుపునట్లు చారుల నేర్పఱచుము" అని వానికిఁ జెప్పి, విష్ణుగుప్తుఁడు నందులకును రాక్షసునకు

నెడఁబాటు కలుగు సమయము కనిపెట్టియుండెను. శేఖరుఁడు విష్ణుగుప్తుఁడు చెప్పినచొప్పున సర్వము సిద్ధము చేసియుంచెను.

---

## ఏఁ డెవఁడు ?

అచ్చట నందులు, పటకుటీరమునందు విశ్రమించి యుండిరి. సంధికై పర్వతరాజునొద్దకుఁ బంపిన దూత వచ్చి తాను బోయివచ్చిన సంగతిని వివరముగఁ దెలిపెను. రాక్షసామాత్యుఁ డది విని, ఇఁక రెండుమూఁడు దినములవఱకు యుద్ధములేక అవకాశము దొరకెనుగదా యని సంతోషించుచుఁ దన విడిదిఁ జేరెను. నందులును నెమ్మదిగ శయనించిరి. రాక్షసుఁడును రెండు మూఁడు దినములు నిద్రాహారములు లేక ఘోరముగఁ బోరు సలుపుటచే గాఢనిద్రకు లోనయ్యెను. అట్టియెడ మాసోపవాసిశిష్యులు, నందుల గుడారములోఁ బ్రవేశించి, "మహారాజులారా! మేము మాసోపవాసి శిష్యులము; నేఁడు శుక్రవార మగుటచే, హోమము సమాప్తమగుచున్నది. పూర్ణాహుతి సమయమున దేవతాదర్శనముసేయుటకు విచ్చేయవలసిన సమయమిదే! మా గురువులు మీకై వేచియున్నారు" అనిరి. రాక్షసుఁడు గాఢనిద్రలో నున్నాఁడని తెలిసికొని 'సుఖముగా నిద్రింపనిమ్ము' అని, తామే తురగములనెక్కి జపశాలకు వెడలిరి. వారు జపశాలఁ బ్రవేశింపఁగా నీ కాశీమార్గమందు దిక్కులు పిక్కటిల్లునట్లు శతఘ్నులు ప్రేలెను. నందు లది విని 'కాశీశునికిని బర్వతేశునకును యుద్ధము తటస్థించినట్లున్నది'

అని మాటలాడుకొనుచు, హోమగుండమును జుట్టి వచ్చుచుండిరి. అంతలో నిరువురు రౌతులు జపశాలయొద్దకు వచ్చి నిలిచి, 'పరాకు! నందభూపతులారా!' అని బిగ్గరగా నఱచిరి. దానిని విని నందులు 'ఏమి! మీ రెవరు?' అని ప్రశ్నించిరి.

''మహారాజా! మేము కాశీరాజు భటులము; నేఁడు కాశీశుఁడు, పర్వతేశునకుఁ జెప్పిన మాటచొప్పున సేనలతో వెడలి వారి దళములయొద్దకు వచ్చుచుండఁగాఁ బర్వతరాజ పుత్త్రుఁడైన మలయకేతువు సపరివారుఁడై యతని కెదురేఁగెను. అప్పుడు మా రాజు, అతనిని సమ్మానించి తా నెక్కియున్న గజముపైఁ గూర్చుండఁబెట్టికొనెను. మా రాజు వానితో సంభాషించుచు, తా నెక్కియున్న గజమును పాటలీపుర మార్గముగఁ ద్రిప్పెను. మలయకేతుఁ డందులకు భీతుఁడై క్రిందికి దూఁకెను. అప్పుడు రాజు, మలయకేతువును బట్టునట్లు తన సైనికుల కానతీయఁగా, మా సేనలకును మలయకేతువు పరివారమునకును యుద్ధము తటస్థించెను. మలయకేతువు మా చేతఁ జిక్కెను. తక్కినవారు పాఱిపోయిరి. అంత, పర్వతరాజా వర్తమానము తెలిసి తమమీఁదికి వచ్చుటకుమున్నె తనకుఁ దోడుగ మీసైన్యములను బంపవలయునని మా రాజు మమ్ము మీ సన్నిధానమునకుఁ బంపిరి'' అని భీతులై పలికిరి.

ఆ మాటలు విని నందులు, జపమువలని ప్రయోజన మిప్పుడే చేకూఱెనని సంతసిల్లి, కాశీనుసేనలకుఁ దోడుగఁ దమ సైనికులను బంపిరి. వెంటనే, 'జయము! జయము!' అని కేకలిడుచు నొక తండమువారు నందులున్న జపశాల

కడకు వచ్చుచుండిరి. ఆధ్వని విని, ఇదేమని భటుల నడుగఁగా "నందప్రభువులారా! చెఱవట్టిన మలయకేతువు నీ పల్లకిలోఁ గూర్చుండఁబెట్టి మీ సన్నిధానమునకుఁ బంపిరి" అని నివేదించిరి. ఆ మాటలకు నందులు సంతుష్టులై తమ కా వర్తమాన మందించినవారికి బహుమతులుచేసిరి. అంతలోఁ దురగారూఢులైన కాశీరాజభటులు తమ చెఱకుఁ జిక్కిన మలయకేతువును బర్వతేశుని సైనికులు విడిపించుకొని పోదురేమో యను సందియముతో నా పల్లకి చుట్టుప్రక్కలఁ గ్రమ్ముకొనిరి.

అప్పుడు, నందు లా పల్లకియొద్దకు వచ్చి లోపలనున్న పురుషుఁడు మలయకేతువని భావించి, "ఓరీ, మలయకేతూ! బుద్ధిహీనుఁడవై యిట్టి యకార్యము చేసి మా చెఱకుఁ జిక్కితివే!" అనిరి. ఆమాటల కా కపట మలయకేతువు వారలనిఁ జూచి, "రాజోత్తములారా! మా జనకుఁడు భాగ్యహీనుఁడైన చంద్రగుప్తునకు నాశ్రయ మొసఁగినందున నా కీ యవస్థ పట్టినది. మీకుఁ జిక్కినపిదపఁ జెప్పనదేమున్నది?" అనెను. వాని మాటలకు నందులు, "ఓరీ రాజపుత్రా! చంద్రగుప్తుని మా వశము సేయునట్లు నీతండ్రికిఁ జెప్పిపంపుము. నిన్ను విడిచిపుచ్చెదము" అనిరి.

"పూనినపని నిర్వహింపఁ దలఁచి మా తండ్రి శరణుఁ జొచ్చిన చంద్రగుప్తుని విడువఁ దగదు" అని యా రాకొమరుఁడు పలికెను.

"ఓరి బాలుఁడా! పూనినపని యంటివే; అదెట్టిది? ఇటు వెలుపలకు వచ్చి చెప్పుము" అని నందులు గద్దించి పలికిరి.

ఆ మాటల కతఁడు! "నంద భూపతులారా! ఏ కార్యము నిర్వహింపఁగోరి వెలుపలకువచ్చి మోముచూపుట!" అను చుండునపుడే తమసైనికులు వచ్చి క్రమ్ముచుండుట దెలిసి, వాఁడు ఖడ్గహస్తుఁడై పల్లకీనుండి వెలుపలకు వచ్చి, చుట్టు ప్రక్కలనున్న జనులను జూచి నవ్వుచుండఁగా, సైనికులు నందులను జుట్టుకొనిరి.

---

## నందవధము

ఈ వింతల నన్నిఁటిని దిలకించి జ్యేష్ఠనందుఁడు "తమ్ములారా! చెఱకుఁ జిక్కిన యీతని చేతికి ఖడ్గము వచ్చు టెట్లు? వీఁ డెవరిని లెక్కవెట్టక, ముఖవైవర్ణ్యములేక చుట్టుప్రక్కల నున్నవారినిఁ జూచి నవ్వుచున్నాఁడు" అని చెప్పుచున్నప్పుడే, భటులు తమ శైవచిహ్నములఁ దొలగించు కొనుచు నొరలనుండి కత్తులు దూయుచుండిరి. అది గాంచి నందులు "హా! హా! ఆపదకుఁ జిక్కితిమి; పెద్దలమాట నతిక్రమించుటవలని ఫల మిది" అనుచుండునపుడే శేఖర సేనాపతి సంకేతానుసారము సైన్యము లమితములై నందులను గ్రమ్ముకొనెను.

అట్టియెడ, జ్యేష్ఠనందుఁడు ఖడ్గమును దూసి, తన్ను వంచింప వచ్చిన కపటమలయకేతువును మొదటి వ్రేటునకే కూల్చి యందుండి సైన్యములమీఁదికి విజృంభించెను. అన్నవలెనే తమ్ములెనమండ్రు ను ద్రేకించి విరోధిబలముల

పై బడి పోరఁజొచ్చిరి. ఎనమండ్రు నందు లెనిమిది దెసల యందును నిల్చిపోర శత్రుదళములు కుప్పలు గూలఁజొచ్చెను.

ఎచ్చటఁ జూచినను నందులుగానే కానవచ్చెదరు; వీరి కిట్టి ఖడ్గవిద్యానైపుణము గఱపిన ఘనులెట్టివారో? ఆ సంగతి దెలిసి, విష్ణుగుప్తుఁడు కోపాగ్నిదంద హ్యమానుఁడై, తన యుత్తరీయమును నడుమునకుఁ జుట్టుకొని, "ఇంకను నందాధములు హతులు గారు; శూరులనిపించుకొనిన మీ రెల్లరు నిష్ప్రయోజకులు; నేనే పోయి సంహరించి వచ్చెదను" అని వేగముగా దండహస్తుఁడై వచ్చుచుండెను. చంద్ర గుప్తుఁ డది గాంచి, కవచము దొడిఁగి ఖడ్గహస్తుఁడై తురగమెక్కి వచ్చుచుండెను. అట్టియెడ శేఖరాది సేనానాయకులు యుద్ధసన్నద్ధులై తోడనే వచ్చుచుండిరి.

ఇట నవనందుల భటులు, మహోజ్జ్వలముగా జప శాల మండుచుండుటం గాంచి, అంగరక్షకులు లేక నందులు జపశాలకడ కేఁగుటయును దెలిసి యేదో ప్రమాదము సంభ వించెనని యూహించి నిద్రించుచున్న రాక్షసామాత్యుని లేపి, "స్వామీ! తమ కాకస్మికముగ నిద్ర క్రమ్మెను. నందులు జపశాలకుఁ బోయినపిదప జపశాల నిప్పంటుకొని మండు చున్నది; రాజుల యంగరక్షకసైన్యము మలయకేతువును బట్టితెచ్చిన కాశీరాజసైన్యముచే హతమయ్యెను. ఇదేమి విపరీతమో!" అని విన్నవించిరి.

ఆ మాటలకు రాక్షసుఁడు విస్మితుఁడై లేచి, "హా! నాకు నిద్రపట్టిన సమయమందు, ఎవరో నందులను జప శాలకుఁ దరలించి, ఇంతేకాక, కాశీరాజసైన్యములని సాకు

వెట్టిరి. అక్కటా! నందు లేమైరో కదా! భాగ్యహీనుఁడనైన నాకీ నిద్ర యేల పట్టవలయును?'' అనుచుఁ గవచము దొడిగి యాయుధము పూని తురగారూఢుఁడై వెడలుచున్నప్పుడు, దిక్కులు పిక్కటిల్ల జయభేరీ నినాదములు వినవచ్చెను. ''హా! నందులు నష్టులైరా?'' అని రాక్షసుఁడు సందేహించుచు వచ్చుచుండఁగా, విరోధిభటులు నందాశ్వముల కలంకరించిన భూషణములు దమ గుఱ్ఱములకుఁ దొడిగి, నందులకుఁ బట్టు శ్వేతచ్ఛత్రము 'నాది నాది' యని కలహించుచు నెదుట వచ్చుచుండిరి. ''హా! హా! నందులు హతులైన మాట సత్యమే! వారు జీవితులై యుండిన వారి సొమ్మిట్లు కొల్లవోవునా! అయ్యో, దైవమా! ఎట్టి యాపదను దెచ్చి పెట్టితివి? హా, నందభూపతులారా! ఎన్నఁటికిని మిమ్ము విడిచి కదలని వాఁడనే! ఆపత్కాలమునఁ బనికిరానైతిని; నాజన్మము కాల్పనా? ఇఁక నెవరిని రాజులని పిలుతును? మిమ్మిట్టి గతికిఁ దెచ్చిన పగవారిని హతముచేసి, వారిచేఁ జంపఁబడి మీ కడకు వచ్చి చేరెదను'' అని తన గుఱ్ఱమును దోడు కొల్పుచు వచ్చుచుండెను.

అట నందులను జుట్టుముట్టియున్న సైనికులు శేఖరాది సేనాపతులు వచ్చుట దెలిసి పెచ్చుపెరిగిన ధైర్యోత్సాహములతోఁ బోరఁ జొచ్చిరి. నందులును సింహములవలె విజృంభించి, యొక్కొక్క ఖడ్గప్రహారమున నైదుగు రార్గురి శిరములు చొప్పున ఖండించుచు వీరవిహారము సలుపుచుండిరి. అదిగాంచి శేఖరాదిసేనాపతులు, ''హా! మనసేనలో మూఁడు పాళ్లు హతమయ్యెను; నందులశౌర్యము పైఁబైని హెచ్చు

చున్నది'' అనుచుండిరి. అంత విష్ణుగుప్తుఁడు, అగ్నిహోత్రునివలెఁ గోపాతిశయముచే మండుచు దండమెత్తికొని, 'నందాధముల నేనే సంహరించెదను' అని ముందునకుఁ బోవుచుండెను. శబరవర్మాదులు "స్వామీ! సేవకులుండఁగా మీకీ యాయాసమేల?'' అని చెప్పిరి. శబరవర్మ జ్యేష్ఠనందునితో ఘోరముగాఁ బోరి ప్రాణములు విడిచెను. చంద్రగుప్తుఁ డదిగాంచి కుపితుఁడై యర్ధచంద్రబాణ మేసి జ్యేష్ఠనందుని శిరము ఖండింపఁగా నతఁడు కూలి కుప్పయయ్యెను. శేఖరుఁడు శబరవర్మ కూలుటకుఁ గోపించి ద్వితీయనందునితోఁ బోరి యతని తల నఱికి కూల్చెను. క్రమముగా మిగిలిన నందు లందఱును శత్రువుల యాయుధములకుఁ బ్రాణములిచ్చిరి. విష్ణుగుప్తుఁడు 'వీరి శిరములను దెచ్చి మాకుఁ జూపుఁడు' అని సేనాపతి కానతిచ్చి చంద్రగుప్తునిఁ గూడి శిబిరముఁ జేరెను.

విష్ణుగుప్తుని యానతిచొప్పున శేఖరునిభటులు నవనందుల శిరములను దెచ్చి యెదుట బెట్టిరి. విష్ణుగుప్తుఁడు వానిని గాంచి, "అక్కటా! వీరి దుర్నయమే వీరి నిట్టిదశకుఁ దెచ్చెను. అయినను రణరంగమందు వీరవిహారము సలిపి, వీరశయనమలంకరించినవా రగుట వీరి కుత్తమగతులు గలవు'' అని చంద్రగుప్తునిఁ జూచి, "కుమారా! ఇఁక చింత విడువుము. గంగాస్నానము సేయుము. యుద్ధనిహతులయిన యీ నీ పినతండ్రులకు సద్గతిగలుగునట్లు స్నానతర్పణములు సేయుము. ఇప్పుడు నా ప్రతినయు నెఱవేరెను'' అనెను. ఆ మాటలకుఁ జంద్రగుప్తుఁడు కన్నుల నీరు నించెను.

అంత విష్ణుగుప్తుఁడు "చంద్రా! రణరంగమున వీరశయనము నలంకరించుట యుత్తమ క్షత్రియుల ధర్మము. దీనికై వగ పేల? అయినను లోకులను జంపించుటకును జంపుటకు నీశ్వరుఁడే కర్త. ఈ నందులకుఁ దిలోదకము లిమ్ము" అని చంద్రగుప్త నోదార్చి గంగాస్నానమునకుఁ బంపెను. తానును గంగాజలముల మునుకలిడి విప్పఁబడియున్న సిగ ముడివేసి చంద్రగుప్తునితోఁ దన విడిదిని జేరెను.

అట్టియెడ నందులు హతులైరను వార్త వృద్ధుఁడగు సర్వార్థసిద్ధి విని పీఠమునుండి దిగువఁబడి మూర్ఛితుఁ డయ్యెను. అమాత్యరాక్షసుఁడు చేయునది తోఁచక, వృద్ధ రాజునొద్దకు వచ్చెను. వృద్ధనరపాలుని శీతలోపచారములచే సేదఁదేర్చి తగినపలుకులచే దుఃఖోపశమనముఁ జేసి, "స్వామీ! నే నిచట నున్నచో నందపక్షపాతి యని చంద్రగుప్తుఁడు నన్ను నిగ్రహించును. కావున నిందుండి వెళ్లిపోవుచున్నాను; చంద్రగుప్తుఁడు మీకుఁ బౌత్రుఁడు. వానికి నందులయెడ నున్న ద్వేషము మీయెడ నుండదు. మొదటనే మీకుఁ దెలిసియున్నచో నిన్నియనర్థముల కవకాశ ముండకయే పోవును. ఇఁక చంద్రగుప్తుఁడు వచ్చి మిమ్ము సందర్శించును. వాఁడే యౌరసపుత్రుఁడని భావించి మెలఁగుఁడు" అని కర్తవ్యముఁ దెలిపి తన యిల్లు సేరెను.

అట నందపత్నులు నగ్నికిఁ దమ శరీరము లర్పించి సద్గతిఁ జెందిరి.

---

# విషకన్య

అనంతరము రాక్షసామాత్యుఁడు, "పర్వతరాజసైన్య మిప్పుడు పురముచుట్టు ముట్టడివేసియున్నది. నందుల కాప్తుఁడగు నేను చంద్రగుప్తునకుఁ గనఁబడితినా, వాఁడు నన్నేమి సేయునో? నా కిపుడు మిత్రులే శత్రువులైరి. నందులను మ్రొక్కిన యీ చేతులతో నితరుల నెట్లు మ్రొక్కుదును? కావున, నందశత్రువగు చంద్రగుప్తు నెటులైనను సంహరించి మరణించిన నా ప్రభువులకుఁ దృప్తి యొనఁగూర్చెదను" అని రాక్షసుఁడు నిశ్చయించుకొని, తన ప్రియసఖుఁడైన చందనదాసును రహస్యముగ రావించి, "ఆప్తసఖుఁడ! నందవైరియగు చంద్రగుప్తు నుపాయముచే సంహరించి వృద్ధరాజునకు స్వీకృతపుత్రునైనను గల్పించి యీ రాజ్యాధిపత్యము వానికొసఁగి నందవంశ మంతరింపకుండ నుద్ధరింపనే నీ నగరము విడిచి వెళ్లెదను. నీ వన్యులకుఁ దెలియనట్లు నా భార్యాపుత్రాదులను రక్షింపుము; ఈ వస్తువులున్నైతము నీ వశమందే యుంచుము" అని సర్వ మప్పగించి యొక చోటుఁ జేరి శత్రునిగ్రహముఁ గూర్చి యాలోచించుచుండెను.

ఒకనాఁడు రాక్షసుఁడు జీవసిద్ధిని రావించి, "అయ్యా! ఇది మా చెఱఁకుజిక్కిన వల్లభరాజు కూఁతురు; సంగీతాది సమస్తవిద్యలయందును జతురురాలు; రాజయోగ్యయగు నీయువతీరత్నమును జంద్రగుప్తున కర్పింపవలసియున్నది. నీ వెంట నీబిడను బంపుటకు నా కెట్టి శంకయు లేదు. ఈ సుందరి నీ శిష్యురాలని చంద్రగుప్తునితోఁ జెప్పి వాని శయ్యాగృహముఁ జేర్పుము" అనెను. జీవసిద్ధి యందులకు సమ్మతించి

"అయ్యా! అమాత్యరాక్షసా! చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని మాటఁ ద్రోసిన దీని నంగీకరింపఁడని తోఁచెడిని" అనెను.

ఆ మాటలకు రాక్షసుఁడు "చంద్రగుప్తుఁ డీ కన్య నంగీకరించి తీరును; అనుమానము లేదు" అని యా కన్య నతని కప్పగించెను.

జీవసిద్ధి యా కన్యను గూర్చి రాక్షసుఁడు చెప్పిన మాటల నన్నిటిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని, 'దీని చేరిక చేతఁ జంద్రగుప్తునకు మేలు కలుగునో కీడే కలుగునో యెట్లు పరీక్షించుట?" అని యాలోచించుచుండఁగా నొకనాఁ డా యువతి భోజనము చేసి కొంతయన్నముఁ బరిత్యజించెను. ఒక మార్జాల మటకు వచ్చి యా భుక్తశేషముఁ దిని తత్క్షణమే ప్రాణములు విడిచెను. అది చూచి జీవసిద్ధి "ఇది విషకన్య; చంద్రగుప్తునిఁ గపటోపాయమునఁ జంపఁగోరి రాక్షసుఁడు దీనిని నావెంటఁ బంపుచున్నాఁడు. విష్ణుగుప్తున కీ సంగతి మొట్టమొదటనే సూచింపవలయును" అని సమయమును గనిపెట్టియుండెను.

అట రాక్షసుఁడు తానంపిన విషకన్యాసంయోగము చంద్రగుప్తునకుఁ దటస్థింపదేని, పట్టాభిషిక్తుఁడై పుర ద్వారము ప్రవేశించునప్పుడైనను వానినిఁ జంప నెత్తువేసి, మావటీని రావించి, "ఓరీ! మనరాజుల పగవాఁడైన చంద్రగుప్తుఁడు పట్టాభిషిక్తుఁడై గజమారోహించి రాజద్వారమును బ్రవేశించుటకుమున్నే సమయము దెలిసి, వానిని సంహరించి సందడిలోఁ దప్పించుకొని పాఱిపొమ్ము" అని వానికిఁ గావలసినంత ధనమొసఁగి పంపివేసెను. పిమ్మట

భవనపాలకునిఁ బిలిచి, "అయ్యా! రెండుమూఁడు దినములలోఁ జంద్రగుప్తుఁడు రాజై పురప్రవేశము సేయును. నీవు నందుల వినోద విహారార్థము నిర్మితమైన కుమారభవనమలంకరించి యందొక గూఢప్రదేశమునందు జనుల నుంచి తరుణము గనిపెట్టి చంద్రగుప్తుని సంహరింపుము" అని యానతిచ్చి పంచెను. అటుపిమ్మట రాజవైద్యుని రావించి వానికిఁ దెలుపవలసిన కపటోపాయములన్నియుఁ దెలిపి యతనికిఁ గావలసినంత ధన మొసఁగెను. తన మిత్రుఁడైన శకటదాసునకుఁ జెప్పవలసిన మాటలను జెప్పి గూఢచారులను రావించి వారు చేయవలసిన పనులను దెలిపెను. తానుండు చోటు సూచించి, తన పరిచారకులను రావించి, వలసినన్ని వస్తుసామగ్రులతోఁ దాను జెప్పిన సంకేతస్థలమునకు రావలయునని నియమించి తాను సురంగమార్గమున వెడలిపోయెను.

ఇట విష్ణుగుప్తుఁడు సభయందుఁ గూరుచుండి, చంద్రగుప్తునిఁ జూచి "కుమారా! పాటలీపురమునందలి యధికారులందఱు కాన్కలర్పించి నిన్ను సందర్శించి తమతమ యధికారములందు నియుక్తులైరి. రాక్షసామాత్యుఁ డొకఁడు రాఁడు. ఆతని నెచ్చట వెదకినను గానరాఁడు" అని యాతని యునికి దెలిసి రండని భటులను బంపెను. వారు నగరమందంతటను వెదకి రాక్షసుఁ డెచ్చటను గానరాఁడని తెలిపిరి.

ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు "అమాత్యరాక్షసుఁడు చంద్రగుప్తునకు భయపడి పాఱిపోవలసిన యగత్యము లేదు. చంద్రగుప్తునకు నందులపై నే ద్వేషము కాని రాక్షసుని ద్వేషించుటకు హేతువు లేదు. అతఁడు లేని సభ చంద్రుఁడు

లేని నక్షత్రమండలము వలె శోభిల్లదు" అని తలంచి, "యతనిని వెదకి సమ్మకము పలికి పిలుచుకొని రండు. ఆతని యిచ్ఛానుసారము చంద్రగుప్తుడు నడచికొనును" అని మరల భటులను బంపెను.

'నందులను జంపి, వారి పదవి చంద్రగుప్తున కొసగుదు నని చేసిన ప్రతిజ్ఞానుసారము నందులు హతులైరి; కాని నందుల రాజ్యమంతయుఁ జంద్రగుప్తున కెట్లు లభించును? పర్వతరాజున కర్ధరాజ్య మియ్యవలసి యున్నది. ఈ పీడ వద లించుకొనుట యెట్లు?' అని విష్ణుగుప్తుఁడు తలపోయుచుండెను.

పిమ్మట చంద్రగుప్తుఁడు సామంతులఁ జూచి, "రాజు లారా! మా తాతగారి యాధిపత్యమున మీరు వహించి యున్న ప్రభుత్వము, తొంటివలెనే జరుపుచు, మాకుఁ గప్ప ము లెప్పటివలెనే యిచ్చుచు మా కార్యములకుఁ దోడ్పడు చుండునది" అని నియమించి, అధికారులను జూచి, "వంశ పరంపరగ మమ్ము సేవించు నుద్యోగస్థులారా! బుద్ధియందు బృహస్పతి యనఁదగిన యీ విష్ణుగుప్తుఁడు మా మంత్రిత్వ మున కొడఁబడెను. వీరి యాజ్ఞను రాజగు నేను సైతము శిరసావహించెదను. మీరు నితఁ డేసమయమున నేమి యాన తిచ్చునో యది యెట్టిదైన నా క్షణమే చేసివచ్చి మాకుఁ దెలుపునది" అనెను. వారెల్లరు మహాప్రసాదమని సమ్మతించి నమస్కరించి సెలవుదీసికొని వెడలిరి. విష్ణుగుప్తుఁ డప్పుడు శేఖరుని రావించి, "అయ్యా, సేనాపతీ! నేను చెప్పినట్లే సాహసించి నందుల సంహరించితిని. నీవు పర్వతరాజున కెట్లు లొప్పుఁడవో యటులే యాతఁడు మా కొప్పుఁడు.

శత్రునిగ్రహమునకుఁ బిదప యుద్ధమున కవసరము లేదు. ఉభయసైన్యము లొక్కచోటనే నిలిపియున్న క్షుద్రరోగములు పుట్టి ప్రజలకు హాని కలుగును. కావున, మీ సేనలలో గొంతసైన్యముమాత్రము నిలిపికొని తక్కినదానిని బంపివేయుము. నందరాజ్యమం దర్ధము పర్వతేశ్వరున కిచ్చినప్పుడు, రాష్ట్రానుగుణ్యముగఁ గొంతసైన్య మియ్యవలసి వచ్చును. కావున, మిక్కుటమైన సైన్యముతోఁ బనిలేదు'' అని చెప్పి శేఖరునకు వస్త్రభూషణము లిప్పించి సంతుష్టుని గావించి పంపఁగా నాతఁడు వెడలిపోయి పర్వతేశునితో జరిగిన వృత్తాంతమంతయుఁ దెలిపెను.

పర్వతేశ్వరుఁడు శేఖరునిఁ జూచి ''విష్ణుగుప్తుఁడు చెప్పినది నిజమే యగును. అతఁడు చెప్పినట్లే చేయుము'' అని నియమించెను. శేఖరుఁడును మహాప్రసాదమని యందుండి వెడలి తన సైన్యమందుఁ గొంత నిలిపికొని మిగిలిన సైన్యములోనివారిని వారివారి దేశములకుఁ బోవునట్లు లానతిచ్చెను. పర్వతరాజుసైనికు లట్లు వెడలిపోవుటను జూచి విష్ణుగుప్తుఁడు 'చంద్రగుప్తుని రాజ్యాభిషేకమునందుఁ గొంతవఱకు విఘ్నము తొలగినది' అని సంతుష్టిచెంది తక్కిన దెట్లు నివారింపఁగలనని యాలోచించుచుండెను.

మఱునాటి సాయంసమయమునఁ జంద్రగుప్త విష్ణుగుప్తులయొద్దకు జీవసిద్ధి, రాక్షసుఁడు తన కప్పగించిన కన్యకను బిలిచికొనివచ్చెను. అతఁడు చంద్రగుప్తునిఁ జూచి, ''ధర్మాభివృద్ధిరస్తు'' అని దీవించి యాకన్యను ముందు నిలుపఁగా నా బాలికయు నొయ్యారముగఁ జంద్రగుప్తునకు నమ

స్కరించి క్షపణకుని వెనుక దలవాంచి నిలుచుండెను. అట్టి యెడ విష్ణుగుప్తుఁడు క్షపణక వేషధారియైన యిందుశర్మ తన కపరిచితునివలె నటించుచు,

"అయ్యా, క్షపణకుఁడా! నీ వెచ్చటనుండి వచ్చితివి? నీ నామధేయ మేమి? ఈ సుందరి యెవని పుత్రిక? ఈబిడ నీ కెట్లు దొరకెను? మీ దేశ మేది? ఆ కన్యతోడ నీవును గూర్చుండి యీ వివరములు దెలుపుము" అనెను.

"దేవరా! మొదట నందులకాప్తుఁడై యుండి యిపుడు చంద్రగుప్తునివలని భీతిచే వెడలిపోయిన యమాత్యరాక్షసునకు నేను మిత్రుఁడను. నన్ను జీవసిద్ధి యందురు. ఈ కాంత చెఱకుఁజిక్కిన వల్లభరాజు కూఁతురు. రాక్షసుఁడు నన్నీ మెకు విద్యాగురువుగా నేర్పాటుచేసెను. చంద్రగుప్తునకు సమర్పింపఁ బిలిచికొని వచ్చితిని. ఈ యువతి సామాన్య కామినులవంటిది కాదు. ఈమెను దాకినవాఁ డింకొక వనితను దాఁకఁడు. మిమ్మాశ్రయించి జీవింప వచ్చితిని" అని జీవసిద్ధి బదులు పలికెను.

అది 'విషకన్య' యని జీవసిద్ధి మాటలవలన విష్ణుగుప్తుఁడు దెలిసికొనెను; కాని, విషకన్య యగునో కాదో పరీక్షింపఁగోరి, "అచటనున్న పంజరములోని చిలుకను జేతికిఁ దీసికొని పలుకరింపుము చూతము" మని యాకన్య కానతిచ్చెను. ఆ యువతిచేయి సోఁకగానే యాచిలుక చచ్చి క్రిందఁబడెను. విష్ణుగుప్తుఁడు సందియముదీఱి, తా నాకన్నియను దెలిసికొనని వానివలెఁ గీరరక్షకునిఁ జూచి యుపహారాదులఁ బక్షిని బాగుగ నరయుచుండుట లేదని కోపించి, యొక భవనమందు జీవసిద్ధిని విషకన్యతో విడియఁ బంచెను.

## పర్వతరాజు వంచత్వము

తదనంతరము విష్ణుగుప్తుఁడు క్షపణకునిఁ దోడుచేసి విషకన్యను బర్వతేశునొద్దకుఁ బిలుచుకొని పోమ్మనెను. జీవసిద్ధియు నతని యానతిచొప్పున విషకన్యను బిలుచుకొని పర్వతేశ్వరుఁడు విడసియున్నచోటికి వెడలెను. అంత విష్ణుగుప్తుఁ డొక యుత్తరము వ్రాసి సిద్ధార్థకుని చేతి కిచ్చి భాగురాయణున కిమ్మనెను. అతఁడును భాగురాయణున కా యుత్తర మిచ్చి "అయ్యా! నీయందు విష్ణుగుప్తుఁడు విశ్వాస ముంచియుండువాఁడు. నీ వీ యుత్తరమున వ్రాసియుండు నట్లు మెలఁగితివేని నీ యభ్యుదయమునకుఁ గొదువయుండదు" అని చెప్పి వెళ్లిపోయెను. భాగురాయణుఁ డా యుత్తరము చదివికొని యచ్చెరువొందెను. అతఁడు వెంటనే సేనానులను రావించి "చంద్రగుప్తుని యానతిచొప్పున సేనలను దరలించుకొని మలయకేతువు పటకుటీరమునకుఁ బడమటివైపున విడిసియుండి, సమయముఁదెలిసి స్కంధావారములోని సైనికులను దఱుముడది" యని రహస్యముగఁ జెప్పి పంపెను. వారు నా రాత్రియే తమ సేనల నాచోట నిలిపిరి. పిదప భాగురాయణుఁడు "ఇపుడు విషకన్యచేఁ బర్వతేశుఁడు మృతుఁడగును; ఇట్టి తరుణమున సైన్యములను మలయకేతువు గుడారముపైఁ బంపి వానికిఁ భీతిని గల్పించి వాని నందుండి తఱిమికొని వాని పట్టణమునకుఁ బోయి వాని కచ్చట నాప్తుఁడుగానుండి యొకవేళ రాక్షసామాత్యుఁ డటకు వచ్చెనేని, మలయకేతువునకును రాక్షసునకును భేదము గల్పించి, యందుండి యతని వెడలఁగొట్టించునది" అనెడి విష్ణుగుప్తు నభిప్రాయము

మనస్సునకుఁ దెచ్చికొని, "ఇప్పు డాలస్యము చేసితినా కార్యముచెడి ప్రభువులకోపమునకుఁ బాత్రుడ నగుదు" నని భీతిల్లి, నిరాయుధపాణియై యొక యశ్వ మెక్కి మలయకేతువునొద్దకుఁ బోవుచుండెను.

అంత నిట జీవసిద్ధి విషకన్యను బిలిచికొని పర్వతేశ్వరునిఁ జేరి, "అయ్యా! రాక్షసుఁడు దుఃఖముతో నున్నాఁడు. ఆతనికిఁ జంద్రగుప్తునివలన నెట్టికష్టము గలుగకట్లు సంరక్షింపవలసిన భారము మీఁది. మీయనుగ్రహము పొందుటకై పంపిన యీ యువతీమణిని గ్రహింపుఁడు" అనెను. ఆమాటలకుఁ బర్వతేశుఁడు సంతోషించి "అయ్యా, జీవసిద్ధి! ఇఁక నెంతమాత్రము చంద్రగుప్తునివలన భయపడవలసిన యవసరములేదని రాక్షసునితోఁ జెప్పుము" అని యతనిని బంపివేసి యాకన్యారత్నమును బరిగ్రహించెను. వెంటనే యాకన్యవిసము తలకెక్కి యతఁడు విగతప్రాణుఁడయ్యెను.

భాగురాయణుఁడు పర్వతేశుఁడు మరణించినవార్త దెలిసికొని యందుండి మలయకేతువువద్దకు వచ్చెను.

మలయకేతువు "అయ్యా! భాగురాయణా! నీ కేమి యవస్థ లటస్థించెను?" అని యడిగెను. అందుల కతఁడు "రాజకుమారా! నీ నిమిత్తమే నే నీ యవస్థకు గుఱియైతిని. మాటలాడుట కవకాశములేదు. ఇందుండి యిప్పుడే కదలుము. ఇదిగో సిద్ధముగా నుంచియున్న యీ యశ్వమెక్కి నాతోడ రమ్ము" అనెను. అందుల కాతఁడేమియుఁ దోఁచక తొట్రుపడుచు, "అయ్యా, సేనానీ! నీమాటల కర్థము కాకున్నదే! నే నేల యిందుండి కదలవలయును?" అనెను.

"రాజకుమారా! కొంతజాగు చేసితివేని విష్ణుగుప్తుఁడు నీ ప్రాణము సైతమపహరించును. మనము తగినచోటుఁ జేరఁగానే జరిగిన యంశములు విశదముగఁ దెలిపెదను. ఇక్కడ నిలువకుము. అల్లదిగో చూడుము! చంద్రగుప్తుని సైన్యములు!" అనెను. మలయకేతు వా సేనను జూచి, భ్రాంతి నొంది 'మా జనకుఁ డేమయ్యెను?' అనుచునే యచ్చట నిలిచియున్న తురగమెక్కెను. సేనాపతియు, 'మీతండ్రి గతినిగూర్చి పిదపఁ జెప్పెదను; త్వరగాఁ గదలు' మనెను. రాజపుత్త్రుఁడును మిగుల ఖిన్నుఁడై వానితోడ పోవఁదొడ గెను. ఆతని యంగరక్షకులును గుఱ్ఱములెక్కి పాఱివచ్చు చుండిరి. వా రావిధముగ శిబిరము విడిచి యొక యోజనము దాఁటి పోయినపిమ్మట భాగురాయణుఁడు మలయకేతువును జూచి, "అయ్యా! రాజపుత్త్రా! నీకీ బాల్యమునందే యిట్టి దురవస్థను దేవుఁడు తెచ్చిపెట్టరాదు; ఇప్పు డేమి జరిగెనో యెంతమాత్రము తెలియకున్నావు. ఎన్నటికైన నుపకారము స్మరింపఁగలవని నిశ్చయించి నీకడకు వచ్చితిని. విష కన్యచే మీ జనకుఁడు మృతినొందుటయు రెండుగడియల లోఁ జంద్రగుప్తుని సైనికులు నీపైఁ బడి సంహరింతురనియు వింటిని. సేనను దవ్వులనుండి చూచి తొందరగా వెడలివచ్చి నీకుఁ దెలిపితిని. ఇఁక నీ వెచ్చటను నిలువక తరలిపొమ్ము" అనెను. ఆ మాటలకు రాజపుత్త్రుఁడు మిగుల దుఃఖితుఁడై "అక్కటా! మా జనకుఁడు మరణించినవార్త సత్యమా?" యని పలవరింపఁ దొడఁగెను. అట్టియెడ విచ్చుకత్తులతో వచ్చి చేరుచున్న చంద్రగుప్తుని సైనికులను బర్వతేశ్వరుని

సైనికులు చూచి రాజునకుఁ దటస్థించిన గతియే తమకును గలుగునని భీతిల్లి పాఱిపోయిరి. శేఖరాదిసేనాధిపతు లెల్లరు నేమి సేయుటకును దోఁచక మలయకేతువునొద్దకు వచ్చి యతని నోదార్చుచుండిరి. అప్పుడు భాగురాయణుఁడు మలయకేతువును జూచి, "కుమారా! నీ సేనాధిపతు లెల్లరు వచ్చిరి. ఇప్పు డిటనుండి కదలి నీ దేశము చేరి, భావికార్యమునుగూర్చి యాలోచింపుము. నే నెవ్వరి కంటను బడక వెళ్లవలసియున్నది. సందర్భ మేర్పడినచో మఱియొక సమయమున నిన్నుఁ జూచెదను. నీకు శుభమగునుగాక! పోయి వచ్చెదను; సెలవిమ్ము" అనెను.

ఆ మాటలను విని మలయకేతువు "అయ్యా! భాగురాయణా! ఇట్టి యాపత్సమయమున నా ప్రాణము రక్షించి నన్నిటకుఁ దెచ్చితివి. నీ వింకఁ జంద్రగుప్తు నాశ్రయించుట దగదు. నేఁడు నగరముఁ జేరి సేనలను గూర్చికొని పాటలీపుత్రమును ముట్టడివేసి చంద్రగుప్త విష్ణుగుప్తులను సంహరింపక నా తండ్రి కపరక్రియలు గావించుటలేదు" అని ప్రతిజ్ఞ చేసెను. మఱియు భాగురాయణునిఁ దనకు మంత్రిగ నుండునట్లు ప్రార్థించి, యతనితోడ స్వదేశాభిముఖుఁడై పోయెను.

---

## విరోచనుని మరణము

పైని జెప్పిన విధమున మలయకేతువు భాగురాయణునితోఁగూడి స్వరాష్ట్రమునకు వెళ్లుచుండెను. ఈ విషయమును జంద్రగుప్తుని చారులు విష్ణుగుప్తునొద్దకు వచ్చి తెలిపిరి.

అతఁడు పర్వతేశ్వరుని మరణమునకు మిక్కిలి దుఃఖించిన ట్లభినయించి యాతని కుటీరమునకు వెళ్లెను. అచ్చట నతని తమ్ముఁడు విరోచనుఁడు పలవరించుచుండెను. విష్ణుగుప్తుఁ డది గాంచి తన మనస్సులో సంతసిల్లెను; కాని, వెలుపలివారు వినునట్లు "అక్కటా! మహారాజు విషకన్యచే మృతుఁడై యుండవలెను. రాక్షసామాత్యుఁడు, చంద్రగుప్తునిగాని మలయకేతువునుగాని చంపించు నుపాయముఁ గోరి, జీవసిద్ధి వెంట విషకన్యను బంపినందులకుఁ బ్రయోజన మొనఁగూడినది. చంద్రగుప్త పర్వతేశ్వరులలో నెవ్వరు నష్టమైనను మా కొక నేత్రము లోపించినట్లయ్యెను. మించిన పనికిఁ జింతించి ఫలమేమి? కుమారుఁడు మలయకేతువు, జనకుని మరణవార్త విని భీతుఁడై పాఱిపోయెను" అని విరోచనునికి మాటలు పలికి, "అయ్యా, మహారాజా! లోకాపవాదమునకు నన్ను గుఱిసేసి మీ యన్నకొడుకు విచారింపక పాఱిపోయెను. పుర మలంకరింపఁ బంచితిని. బుధవారము లగ్నము నిశ్చయింపఁబడెను. మా వాగ్దానముచొప్పున మొదట నీ కర్ధరాజ్యమున కభిషేకము జరుగనిమ్ము. తక్కిన కార్యములు పిమ్మట జరుగును గాక!" అని సమాధానపఱచి యొప్పించెను. అందఱును పాటలీపురమునఁ బ్రవేశించిరి. అనంతరము విష్ణుగుప్తుఁడు రూపవంతుఁడైన పర్వతరాజుసోదరునిఁ జంద్రగుప్తుని యాభరణముల నలంకరించి, నందు లెక్కునట్టి పట్టపుటేనుఁగుపై వానిని గూర్చుండబెట్టి యూరేఁగించెను. వారెల్లరు బాగుగ నలంకరించియున్న రాజద్వారమునొద్దకు వచ్చుచుండిరి. పౌరులెల్లరుఁ జంద్రగుప్తుని పట్టాభిషేక

మహోత్సవమే జరుగుచున్నదని గుంపులు గుంపులుగ విచ్చే యుచుండిరి. గజ మా ద్వారమును సమీపించుచుండెను. అప్పుడు చంద్రగుప్తుని జూచి విష్ణుగుప్తుఁడు "కుమారా! ఈద్వారమునొద్ద నేమో విశేషము జరుగునట్లు తోఁచెడిని. మన మిచ్చటనే నిలిచి చూచుచుందము" అని చెప్పుచుండు నప్పుడే యా పట్టపుటేనుఁగు ద్వారమును సమీపించెను.

విరోచనుఁడు రాజద్వారముఁ బ్రవేశింపఁగానే మొదట రాక్షసునిచేఁ బ్రేరేపింపఁబడిన దారువర్మ పైభాగమున నెవ్వరికిఁ గానరాక దాగియుండి వచ్చువాఁడు చంద్రగుప్తుఁడే యని నమ్మి యంత్రము ద్రిప్పెను. అప్పుడే బర్బరకుఁడను మావటీఁడును రాక్షసుఁడిచ్చిన స్వర్ణదండములోని శస్త్రమును దీయఁగా, బెదరి యాగజము వేగముగ రెండడుగు లిడెను. దారువర్మ విసరిన తోరణయంత్ర మా మావటీనిపైఁ బడి హతునిఁ గావించెను. "ఇఁక నేనెట్లును జీవింపలేను; చంద్రగుప్తుని చంపితినేని నా ప్రభువు ఋణమైనను గొంతతీఱును" అని తలపోసి దారువర్మ యాగజముపై దుమికి విరోచనునిఁ బొడిచి కూల్చెను. వెంటనే యాగజముతో వచ్చుచుండిన రక్షకులు దారువర్మను బొడిచి కూల్చిరి.

అప్పుడు విష్ణుగుప్తుఁడు చంద్రగుప్తునిఁ జూచి రాక్షసుని పన్నాగముచే సీ విరోచనుఁడును గూలెను. ఇందులకు మన మేమి చేయచ్చును?" అని యాచోటు విడిచి, చంద్రగుప్తుఁడు నివసించుటకు నేర్పరచియున్న భవనమునుగూర్చి పోయెను. అచ్చట విష్ణుగుప్తుఁడు చంద్రగుప్తుని సంహరింప నిట నేమైనను గల్పింపబఁడి యుండునేమో యని సందేహించి

యచట నమర్చియున్న ప్రతివస్తువును బరిశోధింపఁ దొడఁగెను.

అప్పుడొక పటమును జూచి "వేఁకువను దర్శింపఁదగిన యీ దేవతాపటము కుడివైపునఁ గట్టక యెవ్వఁడో తెలియని వాఁ డెడమవైపునఁ గట్టియుంచెను. దీనిని దీసి కుడివైపు నున్నగోడకుఁ గట్టుఁడు" అని భటుల కాజ్ఞ యొసఁగెను. వా రా పటమందుండి తీయుచో దాని వెనుకవైపున గోడలో నొక మనుష్యుఁడు దాఁగి కూర్చుండ దగినంత సొరంగ ముండెను. ఆ చోట శస్త్రమొకటి యుంచఁబడి యుండెను. 'ఇది యిక్కడికెట్లు వచ్చిన' దని సందేహించి, చుట్టు ప్రక్కలఁ బరిశోధించుచు వచ్చునప్పుడు చీమలు గొన్ని మెతుకులు నోటఁ గఱచుకొని, బారులుదీరి పోవుచుండినవి. 'ఈ ప్రదేశమున మెతుకులు వచ్చుట కేమి కారణ' మని తలపోసి పటము వెనుకనున్న యా బొరియలోఁ గడ్డి పెట్టించి నిప్పునెట్టించెను. ఆ పొగకు, గోడసురంగములో జంద్రగుప్తునిఁ జంపుటకై రాక్షసుఁడు నియమించియున్న ఘాతుకులు చచ్చిరి. విష్ణుగుప్తుఁడివన్నియును గాంచి రాక్షసుఁడు లోఁబడు నంతవఱకుఁ జంద్రగుప్తునకు క్షేమము లేదని తలపోసి తన శిష్యగణముతో విడిఁది జేరెను.

ఒకనాఁ డొక రాజవైద్యుఁడు విష్ణుగుప్తుఁడున్న విడిదిని జేరి, "అయ్యా! నేను చిరకాలమునుండి రాజుల నాశ్ర యించి బ్రతుకుచున్న వైద్యుఁడను. మిమ్ము దర్శించి మీ యాశ్రయము పొందఁగోరి వచ్చితిని" అని విన్నవించెను. అది గాంచి విష్ణుగుప్తుఁడు వైద్యు లెందఱో యుండఁగా

'వీఁడేల యిట్లనువర్తించుచున్నాఁడు? కానిమ్ము; వీనిని బరీక్షింతము' అని నిశ్చయించి, "అయ్యా, భిషగ్వరుఁడా! పదునైదు దినములనుండి చంద్రగుప్తుని శరీరమున నుష్ణ మధికమై యాహారము రుచింపకున్నది; నిద్రపట్టదు. అతనికిఁ దగిన యౌషధ మిచ్చి యారోగ్య మొనఁగూర్పు" మనెను. ఆ వైద్యుఁడును జంద్రగుప్తుని నాడి పరీక్షించి, "ఇంతమాత్రమునకు గొప్పయౌషధములతోఁ బ్రసక్తిలేదు. ఒక చిటికెడు చూర్ణ మిచ్చెదను. నీటిలోఁ గలిపి త్రాఁగిన దేహమునకు స్వస్థత గలుగు" నని ఒకపాత్ర నీటిలో నింతమందు కలిపెను. "వైద్యులను బరీక్షింపక, ప్రభువు వారివస్తువులు లోఁగొనరాదు; కావున నీ వీ యౌషధమును సేవింపుము" అని విష్ణుగుప్తుఁడు గట్టిగా పలికెను. ఆ వైద్యుఁడు మాఱు పలుకుటకుఁ దోఁచక యామందును ద్రాగెను. వాఁడాచోటువిడిచి యిల్లుచేరి కాలగతి నొందెను. ఇవ్విధముగా రాక్షసునికుట్రలకు విష్ణుగుప్తుఁడు ప్రతీకారములు చేయుచుండెను. విష్ణుగుప్తుఁడును వృద్ధరాజు జీవించియుండునంతవఱకును, రాక్షసుఁడు ప్రధానామాత్యపదవి నంగీకరింపకుండునంతవఱకును చంద్రగుప్తునకు నెమ్మది గలుగదని నిశ్చయించుకొనెను.

---

## సర్వార్థసిద్ధి మరణము

ఒకనాఁడు విష్ణుగుప్తుఁడు తన గూఢచారులను రావించి "చారులారా! మీరెల్లరు సమయోచితమైన వేషభాషలను వహించి యీ పురమునం దంతటను దిరుగుచు,

రాక్షసుని సంబంధించినవా రెవ రిచ్చటం గలరు? వా రెవరి కొద్దకు పోవుచు వచ్చుచుండెదరు? చంద్రగుప్తునికిం బగవా రెవరు? మేలు దలంచువా రెవరు? రాక్షసుని కుటుంబము వా రెచ్చట నున్నారు? వీని నన్నిటిని దెలిసికొని చెప్పుండు" అని యానతిచ్చి పంపెను. పిమ్మటం జంద్రగుప్తునిం జూచి "కుమారా! నీ వృద్ధపితామహుని దర్శించి యాతని దీవనలు పొందిరమ్ము" అనెను. చంద్రగుప్తుడు పితామహుని సందర్శించి ప్రణమిల్లి నిలువంగా నా వృద్ధరాజు "బాలకా! నీవైన నాయుష్మంతుండవై యుండుము. నిన్నుం జూడంగానే నా కొడుకైన మౌర్యునిం జూచినట్లాయెను. నీకు ద్రోహముం దలంచినవారు దుర్గతిపాలైరి. నేను దపస్సుసేయ వనముల కేంగెదను. నీవు పుత్రపౌత్రాభివృద్ధిం గలిగి నెగడుము" అని దీవించెను.

మఱునాండు, సర్వార్థసిద్ధి భార్యాసమేతుండై వనములకు వెడలిపోయెను. విష్ణుగుప్తుం డది తెలిసి వృద్ధరాజు వనముల కేగిన సంగతి రాక్షసునకుం దెలిసినచో గొప్ప యాపద కలుగును. ఆతం డా వృద్ధరాజునుచేరి సత్కులీనుండైన క్షత్రియబాలు నొకనిం దెచ్చి యాతనిని దత్తపుత్రునిగం జేసి, పిదప మనవలెనే యే రాజునైన నాశ్రయించి, చంద్రగుప్తునెడ దాను వహించియున్న ద్వేషము సాధించుకొనును. దీని కేమి ప్రతీకార" మని తలపోసి తపోవనమందే వృద్ధరాజును సంహరింపవలయునని నిశ్చయించెను. వెంటనే కొందఱు ఘాతుకులను బిలిచి యా కార్యము నిర్వహించునట్లానతిచ్చి పంపివేసెను.

'ఒకనాఁ డరణ్యమందలి యాశ్రమమున సర్వార్థసిద్ధి యోగముచే శరీరము పరిత్యజించెను' అను వార్త చారుల వలన విష్ణుగుప్తునికిఁ దెలియవచ్చెను. మనము చేయవలసిన పనిని దైవమే చేసెనని యాతఁడు తలఁచెను.

---

## రాక్షసుఁడు మలయకేతువు నాశ్రయించుట

పురమునకు వెలుపల చాలదూరమున నొక రహస్య స్థలమందు రాక్షసుఁడు నివసించుచుండెను. వృద్ధరాజు మరణ వార్త విని "హా! వృద్ధరాజా! ఇఁక నందవంశమను మాట భూమినుండి తొలఁగెను" అని దుఃఖించెను. ఆతనికి నన్నపాన ములయం దభిరుచి పొడమలేదు. పిదప, నొక గూఢచారుని వలనఁ జంద్రగుప్తుని మరణమునకై తాను జేసిన ప్రయత్న ము లన్నియు నెదురు తిరిగిన వని దెలిసి యతఁడు మిక్కిలి వగచెను.

రాక్షసుఁ డంత నా చారునిఁ బిలుచుకొని పర్వత రాజ్యమునకు పయనమై కొన్ని దివసములకు దాని రాజధానీ నగరము జేరి, పురబాహ్యోపవనమున విడిసెను. భాగురా యణుఁ డాసంగతి తెలిసికొని, "ఇతఁడు మలయకేతువుతోఁ జెలిమిచేసికొని, చంద్రగుప్తునిమీఁది కెత్తివలయు నను తలంపుతో వచ్చియున్నాఁడు. విష్ణుగుప్తుని యానతిచొప్పున నిప్పుడె రాక్షస మలయకేతువులకు భేదము గల్పించితి నేని, ఇతఁ డెటకేనియుఁ బోయి, ఇతరుల నాశ్రయించి తన కార్యము సాధించికొనును. కావున నిచ్చటనే యతనిని జేర్చి, సమయము కనిపెట్టి తగినట్లు భేదముఁ గల్పించెద" నని

తలపోయుచు నాస్థానముఁ జేరెను. అప్పుడు మలయకేతువు భాగురాయణునిఁ జూచి, "అయ్యా! రాక్షసామాత్యుఁడు మమ్ము దర్శింపవలయునని దూతను బంపియున్నాఁడు. అతఁడు చంద్రగుప్తునకు శత్రువగుటచే మనకు మిత్రుఁడు. ఆతఁడు కార్యదక్షుఁడును దూరదర్శియు నగును ఆతని వలననే మనము పాటలీపురమును సాధింపవలయును. ఉచిత రీతిని బిలుచుకొని రమ్ము" అని యానతిచ్చెను.

మలయకేతువు నానతిచొప్పున భాగురాయణుఁడు పరివారసమేతుఁడై వెళ్లి, రాక్షసుని సందర్శించి కుశలప్రశ్న మడిగి యాతనిని రాజసభకుఁ బిలుచుకొని పోవునప్పుడతనిరాక తెలిసి మలయకేతు వెదుర్కొని పోయి నమస్కరించెను. "జయశీలుఁడవు కమ్ము" అని రాక్షసుఁ డతని దీవించెను. మలయకేతువు రాక్షసు నుచితాసనాసీనునిఁ జేసి, పిదప యాసన మలంకరించెను. అప్పుడు రాక్షసుఁడు "కుమారా! నేను మీ జనకునకు మిత్రుఁడను. అది యటుండ నిమ్ము; వంచకుఁడైన విష్ణుగుప్తునిమాట నమ్మి మీతండ్రి మరణముపాలయ్యెను. నిన్నుఁ జూడవచ్చితి" ననెను.

"అయ్యా, అమాత్యశ్రేష్ఠా! విధి యట్లున్నది. మీరే నాకిపుడు తండ్రియై నన్ను రక్షింపుఁ" డని ప్రార్థించెను. రాక్షసుఁ డచటనే యుండెను.

మఱునాఁడు, మలయకేతువు రహస్యముగా రాక్షసునితో "నిఁక ముందుఁ జేయఁదగిన పని యేమి?" అని ప్రశ్నించెను. అప్పు డతఁడు, "రాజపుత్రా! నా కర్తవ్య మెట్టిదైనను ప్రభువు నాశ్రయింపక సిద్ధింపదు; విష్ణుగుప్తుఁడు మీ జనకుని

బోధించి పిలిచికొనిపోయి, వంచనచే నందులను సంహరించి, తన వాగ్దానముచొప్పున మీ కర్ధరాజ్య మిచ్చుట కిష్టములేక విషకన్యచే మీ తండ్రిని జంపించెను. ఇప్పటికైన నర్ధరాజ్యము నీకొసఁగక నిన్ను నిర్లక్ష్యము చేసెను. ప్రభువగువాఁడు ద్రోహులను దండింపక మిన్నకుండరాదు. నందరాజ్యమున నాకుఁగల ప్రజానుకూల్య మితరులకు లేదు. ప్రముఖులైన నా పక్షమువారు, వంచించి చంద్రగుప్తునిఁ జంప సమయము కనిపెట్టియున్నారు. ఇట్టి తఱి, నీవు సేనలఁ గూర్చికొని పాటలీపుత్రముపై విడియవలయును; నేను భోగాసక్తుఁడనై రాజ్యము సాధింపఁ దలఁచి వచ్చినవాఁడను గాను. స్వామిభక్తి నిర్వహించి కీర్తి సంపాదింపఁ దలఁచి వచ్చితి'' ననెను.

ఆ మాటలకు మలయకేతువు మిగుల సంతసిల్లి, "అమాత్యవర్యా! నేను దలఁచిన యర్థమునే మీరును గోరితిరి. మీరు తలఁచినచోఁ జంద్రగుప్తుఁ డెంతమాత్రము? అతనితోఁ జేరియున్న విష్ణుగుప్తుఁ డెంతమాత్రము? చంద్రగుప్తుని సంహరింపకయే తండ్రి కుత్తరక్రియలు సేయుట లేదని నేనును బ్రతిన పూనితిని. నా పుణ్యముకొలఁది మీ రిటకు దయచేసితిరి. సర్వాధికారము మీరే వహింపుఁడు. మీరు చెప్పునట్లు నేనును నాతో చేరినవా రెల్లరును నడుచుకొనుచుందుము'' అని రాక్షసునకు విన్నవించెను.

అది మొదలు రాక్షసుఁడును రాజ్యతంత్రములు మెలఁకువతో నిర్వహించుచు వచ్చెను. ప్రజలును సామంత ప్రభువులును రాక్షసుని బుద్ధికౌశలము నాజ్ఞాశక్తిని మిక్కుటముగ శ్లాఘించుచుండిరి.

---

విష్ణుగుప్తునికా రాక్షసుని వృత్తాంతము తెలియకుండ దాఁగుట! "ఈ రాక్షసుఁడు చంద్రగుప్తుని వధింపఁ బన్నిన కపటోపాయములన్నియు భగ్నములగుచు వచ్చుటచేతఁ జంద్రగుప్తు నెటులైన సంహరింపఁ దలఁచి గొప్ప సైన్యము సమకూర్చికొని వచ్చుచున్నాఁడు. వాఁ డేమిచేసినను జేయ నిమ్ము. నేను వాని ప్రయత్నములను గొనసాగింపను. ఈ యంశ మం దతఁడు సేయఁదగిన యత్నములన్నియుఁ జేసి పాటలీపురము దగ్గరింపఁగానే మలయకేతువునకు నతనికి భేదము పుట్టించి, తనయంత నిటకు వచ్చి చేరిపోవున ట్లుపాయము పన్నెద". నని విష్ణుగుప్తుఁడు నిశ్చయించుకొని ఒక చారునిఁ జూచి "నీవు పోయి రాక్షసునకుఁ గనఁబడకుండ పర్వతరాజ్యమున నుండి యట జరుగునట్టి విశేషముల నప్పటికప్పుడు మాకుఁ దెలుపుచుండు"మని పంపెను.

పిదపఁ గోశాధికారిని రావించి, "చంద్రగుప్తుఁడు పరిపాలకుఁడైన పిమ్మట నుద్యోగస్థుల కందఱకు నిలువలేక జీతములు పంచిపెట్టఁబడెనా?" యని విష్ణుగుప్తుఁడు ప్రశ్నింపఁగా "స్వామీ! భాగురాయణాదులు మాత్రము తమ జీతములను దీసికొనుటకై యింతవఱకు రాకున్నారు. మీ యానతిచొప్పునఁ జేసెదను" అని విన్నవించెను.

విష్ణుగుప్తుఁ డా మాటలకు మిక్కుటముగఁ గోపించి, రాజద్రోహియై మలయకేతువు నాశ్రయించియున్న భాగురాయణుని జీత మతనికిఁ జేర్పించి యతని దారసుతాదులను బురమునుండి తొలఁగించునది యనియు, నతని క్రింది

యుద్యోగస్థులగు భద్రభటాదులను సైతము దేశమునుండి వెడలఁగొట్టుఁ డనియు నానతిచ్చి భటులను బంపెను.

అటుపిమ్మట, విష్ణుగుప్తుఁడు సిద్ధార్థకునిఁ బిలిచి వాని చెవిలో రహస్యముగఁ గొన్నిమాటలు నుడివి యొక యుత్తర మిచ్చి పంపఁగా, వాఁడు త్వరితగతిని బోయి, భద్రభటా దులను జూచి చెప్పవలసిన యంశములు సెప్పి యా కమ్మ నిచ్చెను. అది చంద్రగుప్తుఁడు స్వహస్తాక్షరములతో లిఖించినలేఖ యగుటచే వారు దానిని భయభక్తులతో విప్పి, "భద్రభటాది సేనాపతులారా! మీరలిందుండి వెంటనే వెడలిపోయి మలయకేతువును జేరి యచట భాగురాయణుఁడు చెప్పినట్లు నడుచుకొనుచు మెలఁగవలయును" అని జదివి, 'ప్రభువు చిత్తానుసారము మెలఁగెదము' అని సిద్ధార్థకునితోఁ జెప్పి పంపివేసిరి. ఆ తరుణమందే భటులు వచ్చి భద్రభటాదుల యిండ్లవెలుపల నిలిచి, "చంద్రగుప్త మహారాజు నానతిచొప్పున మీరలిప్పుడే యిటనుండి దేశాంతరములకు వెడలిపోవలయును. ఒక క్షణ మాలస్యము చేసితిరేని రాజుకోపమునకు గుఱియగుదురు" అని చాటిచెప్పఁగా వారు భయపడినట్లు నటించుచు నందుండి కదలి పర్వతరాజ్యమునకు పయనమైరి.

భద్రభటాది సేనాపతులు మలయకేతువును సందర్శించి, తాముదెచ్చిన కానుకలను సమర్పించి "రాజపుత్రా! మేము నందరాజులను సేవించుచుండిన భద్రభటాదులము. మాయందు రాజద్రోహము వెల్లడించి విష్ణుగుప్తుఁడు మమ్ము దేశమునుండి వెడలఁగొట్టించెను. అట నిలుచుట

కిష్టములేక మీవంటి రాజుల నాశ్రయించి జీవింపఁగోరి యిటకు వచ్చితిమి'' అనిరి. ఆ మాటలకు మలయకేతువు భాగురాయణునివంకఁ జూచెను.

అంత నతఁడు "రాజకుమారా! ఈ భద్రభటాదులను జంద్రగుప్తుఁ డవమానించి దేశభ్రష్టులను గావించినది సత్య మైనచో నీ ప్రయత్నములు శ్రమలేక కొనసాగు ననుకొనుము. మనము చేయవలసిన యత్న మించుకంతయులేక రాజునకు నతని సేనానులకు భేద మొనగూడుట నీ యదృష్టమే! వీరు మిగులఁ బ్రముఖులు. ఇట్టి నిర్వాహకులులేని చంద్ర గుప్తుని సైన్యము చేవలేని పిప్పి'' అనెను. అట్టియెడ రాక్షసామాత్యుఁ డటకు రాఁగా, మలయకేతు వతనిఁ జూచి "అమాత్యవర్యా! నందసేనానులైన భద్రభటాదులు చంద్ర గుప్తు నుపేక్షించి మనల నాశ్రయింప నిటకు వచ్చియున్నారు; వీరిని విచారించి కర్తవ్య మానతిండు'' అనెను. "ఉపా యముతో వీరికిఁ దగిన పదవు లొసఁగి జాగరూకుఁడనై మెలఁగెద'' నని తలపోసి వారివారి యోగ్యతకుఁ దగిన యుద్యోగము లొసఁగెను.

---

## రాక్షస ముద్రికాహరణము

"ఇన్నాళ్లిచ్చట నుంటివి? ఏమి సేయుచుంటివి? చంద్రగుప్తునెడ మిత్రులెవ్వరు? శత్రువులెవ్వరు?'' అని విష్ణుగుప్తుఁడు రహస్యముగా నొక చారునిఁ బ్రశ్నించెను.

ఆ మాటలకు వాఁడు, "స్వామీ! ఈ పురమందు ముగ్గురు దప్పఁ దక్కినవా రెల్లరుఁ జంద్రగుప్తుని కిష్టులే.

ఒకఁడు, చంద్రగుప్తు నభ్యుదయమున కోర్వలేని జీవసిద్ధి యనెడు నమాత్యరాక్షసుని మిత్రుఁడు; మఱియొకఁడు రాక్షసుని కాప్తుఁడైన శకటదాసు; వేఱొకఁడు రాక్షసునకుఁ బరమమిత్రుఁడైన చందనదాసుఁడను వర్తకుఁడు. రాక్షసుఁడీ నగరము విడిచి వెళ్లినప్పుడు, తన పత్నీపుత్రుల నతని యింటనే దాఁచియుంచెను'' అనెను.

''నీకీ విషయ మెట్లు దెలిసెను?'' అని విష్ణుగుప్తుఁ డడుగఁగా నా చారుఁడు ''స్వామీ! నేను జిత్రపటములఁ దీసికొని శ్రుతిలయలతో గానము సేయుచు నింటింటఁ జొచ్చి పటములు చూపుచుఁ జందనదాసుని యింటికిని బోతిని. అప్పుడైదేండ్ల ప్రాయముగల బాలుఁడు నా వద్దకు వచ్చి నిలిచెను. వానియందు రాక్షసుని పోలిక కనుపించినది. నేను వానివంకనే చూచుచుండఁగా నా యింటిలో నొక యువతి భయముతో నేమో పలుకుచుండుట వినవచ్చెను. దానివలన నా సందేహము బలపడినది. ఇందేదో విశేష మున్నదని యూహించి, రాక్షసామాత్యుని పటమును జూపుచు గానముసేయుచు నతని యశస్సును బొగడుచుఁ గాలక్షేపము సేయుచుంటిని. ఆ స్త్రీయు వాకిలియొద్దకు వచ్చి నిలిచి, సైఁగ చేసి యా బాలునిఁ బిలిచినప్పటికిని పటమునొద్దనే యున్న కారణమున నాబిడ త్వరగా వచ్చి పిల్లవాని చేయిపట్టి లాగికొని పోయెను. అట్టియెడ నాబిడ వ్రేలియందున్న ముద్రయుంగరము జాఱి దిగువఁబడెను. ఆమెను నేను బాగుగాఁ జూడఁగలిగితిని. ఆ చోటు విడిచి వెలుపలకు వచ్చి యెవ్వరును లేనిచోట సావకాశముగ నా

యుంగరమును బరీక్షించితిని. అందు నమాత్యుని పేరు చెక్కఁబడి యుండెను. ఇదిగో యిదియే యది" యని యా ముద్రిక విష్ణుగుప్తున కర్పించెను.

విష్ణుగుప్తుఁడా ముద్రికవంక రెండు నిముసములు చూచి రెండు నిముసము లాలోచించుకొనెను. సిద్ధార్థకునిఁ బిలిచి "అప్పుఁడా! ఒక పని నుద్దేశించి వ్రాసిన యీ లేఖ లోని లిపి జిలుగుగా నున్నది. దీనిని నీకుఁ బరిచితుఁడైన శకటదాసునిచే స్పష్టముగా వ్రాయించి యొక ప్రతిని దెమ్ము" అని యిచ్చి పంపెను. అతఁ డట్లులే వెడలిపోయి తన మిత్రుఁడైన శకటదాసునిచేఁ బ్రతి వ్రాయించికొని వచ్చి యిచ్చెను. అతఁడు దానిని మడిచి రాక్షసుని ముద్రయుంగరముచేఁ బైని ముద్రించి, వాని చెవిలోఁ గొన్ని రహస్యోక్తులు పలికి యా ముద్రయుంగరమును లేఖను వాని కొసఁగి పంపివేసెను.

పిమ్మట విష్ణుగుప్తుఁడు ముగ్గురు చారులను బిలిచి "ఇప్పుడు పర్వతరాజు నాశ్రయించియున్న యమాత్య రాక్షసుని గృహమునకు దాపున వర్తకవేషధారులయి మెలఁగుచు, మీ ముగ్గుర కొసఁగిన ఈ పర్వతరాజు నాభరణములను తక్కువ వెలకైనను రాక్షసామాత్యునకు విక్రయించి రండు" అని యానతిచ్చి పంపివేసెను.

పిమ్మట విష్ణుగుప్తుఁడు కొందఱు భటులను బిలిచి, రాక్షసుని ప్రేరేపణచే క్షపణకుఁడు విషకన్యను బర్వతరాజున కర్పించి యతనిని సంహరించి ద్రోహియాయెను. కావున నా జీవసిద్ధిని దేశభ్రష్టునిఁ గావింపఁ జంద్రగుప్తుఁ డానతి

యొసఁగె'' నని పురమునం దంతటను జాటించి యతనిని దఱుమఁగొట్టునది యని యాజ్ఞ యొసఁగెను. అటులే వారు క్షపణకుని వెడలఁగొట్టిరి.

అటుపిమ్మట కొందఱు భటులను బిలిచి, ''చంద్రగుప్తునకు ద్రోహముఁ దలఁచిన శకటదాసుని శూలారోహణముఁ గావింపుఁ'' డని పంపెను. పిమ్మట నతఁ డొక భటుని బంపి తా నున్నెడకుఁ జందనదాసును బిలుచుకొని రమ్మనెను. వాఁడు చందనదాసు నింటికిఁ బోయి విష్ణుగుప్తు నాజ్ఞను దెలుపఁగా నతఁడు ''కఠినచిత్తుఁడయిన విష్ణుగుప్తుని వలన నా కెట్టి కష్టము కలుగనున్నదో! ఎట్టి విపత్తువచ్చినను భీతిల్లను; రాక్షసుని కుటుంబజనము వానికిఁ జిక్కకపోవుటయే నాకుఁ గావలసినది'' అని తలపోసి యా భటుని వెలుపలనే కూర్చుండఁబెట్టి లోనికిఁ బోయి యమాత్యుని కుటుంబజనమును రహస్యస్థానమం దుంచుట కేదో యేర్పాటు చేసి భటునితోడ విష్ణుగుప్తునియొద్దకుఁ బోయెను.

విష్ణు - చందనదాసా! నీకు క్షేమమా? నీ వర్తకము బాగుగ జరుగుచున్నదా? ఆ యాసనముపైఁ గూర్చుండుము.

చంద.- ''స్వామీ! తమ కృపాతిశయమున సర్వము నిష్కంటకము'' అని నమస్కరించి కూర్చుండెను.

విష్ణు.- చందనదాసా! ప్రజలు చంద్రగుప్తునిఁ గూర్చి యేమని చెప్పుచున్నారు?

చంద.- స్వామీ! శరత్కాల చంద్రికలను వలెనే ప్రజలు చంద్రగుప్త మహారాజ పరిపాలన మపేక్షించెదరు.

విష్ణు - చందనదాసా! సంతుష్టులైన ప్రజలవలన ప్రభువులు ప్రత్యుపకార మపేక్షించుట యుక్తమే కదా?

చంద.- దేవర సెలవిచ్చినట్లే యెల్లరు తమ శక్తికి మీఱి నడచుకొనుటకు బద్ధులు.

విష్ణు.- నిరపరాధులైన పౌరులవలన దండుగలు పెట్టించునట్టి నందులప్రభుత్వము కాదు. మీరెల్లరు క్షేమముగ నుండుటయే చంద్రగుప్తునకు మహాభ్యుదయము.

చంద.- స్వామీ! అటులే మమ్మెల్లర రక్షింపవలయును.

విష్ణు.- చందనదాసా! రాజులకుఁ బ్రియముగ మెలఁగు వారికిఁగదా రాజరక్షణము లభించును.

చంద.- స్వామీ! తన ప్రభువున కప్రియము దలఁచు వాఁడు దురాత్ముఁడే యగును.

విష్ణు.- చందనదాసా! మొదట నీవే రాజద్రోహివై రాజున కప్రియము దలఁచెదవు.

చంద.- స్వామీ! అగ్ని నెదిరించి తృణము లేమిసేయును?

విష్ణు.- రాక్షసుని కుటుంబము నీయింట దాఁచియుంచి కొని యింతవఱకు ప్రభువునకు విన్నవింపకుండుట నేరమగునో కాదో యాలోచింపుము.

చంద.- చిత్తము, మీతో నెవరో నసత్యములుపలికిరి. ఈ యంశము నాకెంతమాత్రముఁ దెలియదు.

విష్ణు.- ఈ యంశము నీకుఁ దెలిసినట్లు రుజువైనచో నిన్నుఁ దండింపవచ్చునుగదా!

చంద.- స్వామీ! రాక్షసుఁడు వెళ్లునప్పు డతని కుటుంబము నాయింట నుంచిన మాట నిజము. కాని, ఇప్పుడు వారు లేరు.

విష్ణు.- వర్తకుఁడా! మొదట చూడలేదని చెప్పి, ఇప్పుడు లేరని చెప్పఁదగునా?

చంద.- చిత్తము, మాట నోరుతప్పి వచ్చెను.

విష్ణుగుప్తుఁడు నవ్వి, "ఓరి వర్తకుఁడ! చంద్రగుప్తుని రాజ్యమందు నోరుతప్పి పలుకవచ్చునా? మా ద్రావిడక రాక్షసుని భార్యాపుత్రులను దెచ్చి యొప్పగింపుము" అనెను. చందనదాసుఁడు తాను గొప్పయాపదకుఁ జిక్కినట్లు చింతిల్లు చుండఁగా వెలుపల జనకలకల మొకటి వినవచ్చెను. అదే మో తెలిసికొని రమ్మని విష్ణుగుప్తుఁడు శిష్యునిఁ బంపఁగా వాఁడు చూచివచ్చి "స్వామీ! విషకన్యచేఁ బర్వతరాజును సంహరించిన నేర ముగ్గడించుచు భటులు చంద్రగుప్తుని యానతిచొప్పున క్షపణకు నూరినుండి వెడలఁగొట్టు చున్నారు" అనెను.

అందులకు విష్ణుగుప్తుఁడు 'తన నేరమునకుఁ దగిన ఫలమే యనుభవించినాఁడు' అనుచుఁ జందనదాసును జూచి "రాజాపరాధమున కీరీతి దండన మొనగూడుట స్వాభావి కము. కావున నీవు రాక్షసకుటుంబమును మా కప్పగిం పుము" అనెను. అందులకుఁ జందనదాసుఁడు "స్వామీ! వారెక్కడనుందురో నాకుఁ దెలియదు" అనెను. అంతలో వీధియందు జనుల కోలాహలము వినవచ్చెను. విష్ణుగుప్తుఁ డా కలకలమేమో తెలిసికొని రమ్మని శిష్యునిఁ బంపఁగా వాఁడు చూచివచ్చి "స్వామీ! భటులు రాజాజ్ఞ ననుసరించి రాజద్రోహియైన శకటదాసును శూలారోహణమునకై పిలుచుకొని పోవుచున్నా"రని చెప్పెను. "వాని ద్రోహమునకు

ననుగుణమైన ఫల మనుభవింప నిమ్ము'' అని చందనదాసును జూచి, "అయ్యా! రాజాపరాధులకు ఘోరదండన మేర్పడు చుండుటఁ జూచుచుండియు నాకుఁ దెలియదని చెప్పెదవే! నీ సతీసుతులకు మేలు గలుగవలయుచున్న రాక్షసుని కుటుంబమును దెచ్చి యప్పగింపుము'' అనెను. అందుల కాతఁడు "స్వామీ! నన్నేల బెదరించెదరు? అమాత్యుని కుటుంబము వారు నా యొద్దనున్నను నిచ్చువాఁడను గాను. లేనివారి నెటనుండి తెత్తును?'' అనెను. ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు "ఆహా! ఈ వర్తకుఁ డెంత సత్యవంతుఁడు! మిత్రకార్యము నకై తన ప్రాణమైన నర్పింప నిశ్చయించె'' నని లోలోన సంతోషించుచుఁ బైకిఁ గోపము నటించి, "ఓరి దురాత్మా! అట్టులైన నీ ద్రోహమునకుఁ దగిన ఫల మనుభవింపుము'' అనెను. అందులకు వాఁడు "స్వామీ! మీ రేమి చేసినను చేయుఁడు'' అనెను. అంత విష్ణుగుప్తుఁడు తన శిష్యునిఁ బిలిచి "ఓరీ! ఈ దుష్టునియింట నున్న వస్తువులను రాజకోశమునకుఁ జేర్చి స్వజన సమేతముగ వీనిని చెఱయం దుంచునట్లు దుర్గపాలునితోఁ జెప్పుము. నేను చంద్రగుప్తునకుఁ దెలిపి వీనికి ఘోరదండన విధింతు'' నని చెప్పి వానిని బంపివేసెను. పిమ్మట శకటదాసుఁడు శూలస్థానముఁ జేరుట తెలిసి విష్ణుగుప్తుని యనుమతిచొప్పున సిద్ధార్థకుఁడు, విష్ణుగుప్త చంద్రగుప్తులను నిందించుచు శకటదాసున్నెడకు వచ్చి కత్తి ఝళిపించుచు ఘాతుకులను తఱుముఁగొట్టి శకటదాసును బిలుచుకొని పర్వతరాజ్యాభిముఖుఁడై పాఱిపోయెను.

---

## కౌముదీ మహోత్సవము

అవి శరద్రాత్రులు. చంద్రుని మనస్సు మిక్కిలి యుల్లాసముగా నుండెను. పరిసరవర్తులగు భటులను జూచి, "భటులారా! నేఁడు మొదలుచేసి బహుళపంచమి దనుకఁ గౌముదీమహోత్సవము జరుగునట్లు పురమునఁ జాటింపుఁడు" అని యానతిచ్చెను. భటులు, 'మహాప్రసాద' మని వెళ్లి, నగరమందంతటను జాటి చెప్పఁదొడగిరి. అట్టియెడ వెలుపల నేర్పడిన జన కలకలము విని విష్ణుగుప్తుఁ డందుల కేమి కారణమో తెలిసి రమ్మని శిష్యునిఁ బంపెను.

వాఁడది చూచి వచ్చి, "స్వామీ! కౌముదీమహోత్సవము జరుపుటకుఁ జంద్రగుప్తమహారా జానతిచ్చె నఁట; భటులు దానిఁ జాటించుచున్నా" రనెను. విష్ణుగుప్తుఁ డంత వానిని జూచి, "ఓరీ! ఈ యుత్సవము జరుపవలసినది లేదు. ఆపివేయుడని మేము చెప్పినట్టు లాభటులతోఁ జెప్పి రమ్ము" అని పంపెను. శిష్యుఁ డటులే చేసెను. భటు లాతని మాటలు విని, "విష్ణుగుప్తు నానతి మీఱినచో నపరాధమునకు బాత్రులగుదుము" అని భీతిలి మరలిపోవఁగా పౌరులెల్ల రది విని, "ఇపుడు రాజాజ్ఞకు భంగ మొనగూడుటవలనఁ జంద్రగుప్త విష్ణుగుప్తుల కేదో మనస్సులు చెడినవి" అని రహస్యముగఁ జెప్పికొనుచుండిరి.

అట్టియెడ రాక్షసామాత్యుని గూఢచారుఁ డొకఁడు పాములవాని వేసముతో పాటలీపురమునం దచ్చటచ్చటఁ దిరుగుచుండి యీ సంగతి దెలిసికొని తనస్వామికి విన్నవింప వచ్చెను.

రాక్షసుఁడు వానిఁ జూచి "రమ్ము, కూర్చుండుము. సుఖముగ వచ్చితివా? అచ్చట విశేషము లేమి?" అని ప్రశ్నించెను. వాఁడు రాక్షసునకు నమస్కరించి, చంద్రగుప్తుని జంపుటకై యేర్పడిన దారువర్మాదులు విష్ణుగుప్తుని మోసమువలన పర్వతరాజు సోదరుని జంపి, తాముకూడ చచ్చిరనియు, శయనగృహమందు మనవారే తగులబడిపోయిరనియు, విషవైద్యుఁడు తానే విషపానముచేయ బలవంతపెట్టబడి మరణించెననియు నిట్లు చంద్రగుప్తుని వధింపఁ దలకొనినవారె మరణమొందవలసివచ్చెననియు రాక్షసునియాజ్ఞవలన విషకన్యచే బర్వతరాజును జంపించెనని క్షపణకుని పురమునుండి వెడలఁగొట్టించెననియు నుడివెను.

రాక్షసుఁడంత, 'హా! విష్ణుగుప్తుఁడు అపకీర్తియంతయు నాతలపై రుద్దుచుండెనా?' అని తరువాత నేమి జరిగెనో చెప్పుమనెను.

"స్వామీ! కుట్రలకు వీఁడే కారణభూతుఁడని శకటదాసును శూలారోహణము గావింపుఁడని యానతిచ్చెను. చండాలురతని వధ్యస్థానమునకుఁ గొంపోవుటను గన్నులారఁ జూచితిని. 'నీ రక్షణమునందున్న రాక్షసుని కుటుంబము వారిని దెచ్చి చూపు' మని విష్ణుగుప్తుఁడు చందనదాసును చెఱయందుంచెను" అని చెప్పుచుండఁగా, ద్వారరక్షకుఁడు వచ్చి, "స్వామీ! శకటదాసుఁడు వచ్చి వెలుపల నిలిచియున్నాఁడు" అనెను.

అమాత్యరాక్షసుఁ డాశ్చర్యపడి వానిని దనయొద్దకు రావించి, "శకటదాసా! ఎట్లు తప్పించుకొని రాఁగలిగితివి?"

అనెను. అందులకు వాఁడు "స్వామీ! చండాలురు నన్ను వధ్యస్థానమునకు గీసికొనిపోయిరి. అట్టియెడ నా మిత్రుఁడు సిద్ధార్థకుఁడు ఖడ్గపాణియై యటకు వచ్చెను. ఆతని హడావిడికి జండాలురు భయపడి తొలఁగిపోయిరి. అతఁడంత నన్నచట నుండి తోడ్కొని వచ్చెను" అనెను. రాక్షసుఁడామాటలకు సంతసిల్లి, వెలుపల నిలుచున్న సిద్ధార్థకుని లోపలకు రప్పించి, 'అయ్యా, సిద్ధార్థకా! శకటదాసును విడిపించి మా దగ్గఱకుఁ దెచ్చితివిగాన నీవు మాకుఁ బరమాప్తుఁడవు; నీ కేమి యిచ్చినను దగును" అని తాను దొడిగియున్న యాభరణము లిచ్చెను. అతఁడు వానిని దీసికొని యొక పెట్టెలోనుంచి తొల్లి విష్ణుగుప్తుఁడు తనకిచ్చిన రాక్షసునిముద్రయుంగరమును రాక్షసున కియ్యఁగా "ఔను, ఇది నా యుంగరమే. ఇది నీ కెట్లు లభించెను?" అని సిద్ధార్థకు నడిగెను. అందుల కతఁడు "స్వామీ! ఈ యుంగరము చందనదాసునింటి వెలుపల నాకు దొరకినది" అనెను. ఆ మాటలకు రాక్షసుఁడేమో యాలోచించి ముద్రికను దీసికొని శకటదాసును జూచి "ఇదిమొదలు ఉత్తరములపై దీనితోనే ముద్ర వేయుము" అనెను. అంత సిద్ధార్థకుఁడు "స్వామీ! నేను పాటలీపురమునకుఁ బోతినేని యపరాధిని విడిపించిన నేరమునకై నన్ను విష్ణుగుప్తుఁడు దండించును. నేను మీయొద్దనే యుండెదను" అనెను. అందుల కమాత్యుఁడు సమ్మతించెను. వా రిద్దఱు పోయి విశ్రమించిరి. తదుపరి చారుఁ డిట్లు రాక్షసునితోఁ జెప్పెను.

"స్వామీ! మఱియొక విశేషము గలదు. చంద్రగుప్తునకు విష్ణుగుప్తునెడ మనఃస్పర్థ కలిగెనని జనులు కర్ణాకర్ణి

చెప్పుకొనుచుండఁగా విని దాని నిజము కనుఁగొనఁగోరి కని పెట్టి యుంటిని. ఒకనాఁడు కౌముదీమహోత్సవము జరుపవలయునని చంద్రగుప్తుఁ డానతీయఁగా భటులు చాటించిరి. 'ఈ యుత్సవము జరుపవలసిన యగత్యము లే' దని విష్ణుగుప్తుఁడు వారిని నివారించి పంపెను" అనెను. ఈ తరుణమందే వారి మనస్తాపము హెచ్చింపవలయునని రాక్షసుఁడు తలపోసి, "చారుఁడా! నీ వీ వేసముతోనే పాటలీపుత్రమునకుఁ బోయి ముందేమి జరుగునో తెలిసికొని నీవెంట నేను బంపుచుట్టి వానితోఁ జెప్పి పంపుము" అని యానతిచ్చెను.

---

## కపటకలహము

ఇట పాటలీపుత్రమందుఁ జంద్రగుప్తుఁడు, తనయాజ్ఞానుసారముగ నలంకారమను మాట ఎచ్చటఁ గానరాక యుండుటను జూచి సమీపవర్తియగు నొకనిఁ బిలిచి "ఏమి! మేము కౌముదీమహోత్సవము జరుపవలయునని యానతిచ్చితిమికదా! దాని చిహ్నము లేమియుఁ గానరావే!" అనెను. ఆ మాటలకు వాఁడు "మహారాజా! విన్నవించుటకు భయమగుచున్నది" అనెను. "అట్లైన యజమానులగు విష్ణుగుప్తు లీ యుత్సవము జరుగరాదని యాటంకపఱచిరా?" అని యడిగెను. అందులకు వాఁడు 'చిత్తము, ఔను' అని బదులుపలికెను.

"యజమానులేల యుత్సవము నిలిపిరి? కనుగొనెదను గాక. విష్ణుగుప్తుల నిటకుఁ బిలుచుకొని రమ్ము" అని యాన

తిచ్చెను. వాఁడు వెడలి విష్ణుగుప్తుని సందర్శించి "మహాత్మా! చంద్రగుప్త మహారాజు, తమ దర్శన మపేక్షించుచున్నారు' అనెను. ఆ మాటలను విష్ణుగుప్తుఁడు, కౌముదీ మహోత్సవము నిలిపినందులకుఁ గారణము దెలియఁగోరె నేమో ?" అని లేచి చంద్రగుప్తుఁడున్నెడకు వచ్చిచేరెను. చంద్రగుప్తుఁ డతఁడు సమీపింపఁగానే పీఠమునుండి దిగి యతని పాదములకు నమస్కరించెను.

అప్పు డతఁడు "రాజా! దీర్ఘాయుష్మంతుఁడవై వెలయుము" అని యాశీర్వదించి యుచితాసనాసీనుఁ డయ్యెను. ఎల్లరును పీఠము లలంకరించిరి. విష్ణుగుప్తుఁడు చంద్రగుప్తునిఁ జూచి, "కుమారా! ఏల మమ్మిటను రావించితివి?" అనిన నతఁడు, "దేవర దర్శనము సేయుట" కనెను.

అందులకు విష్ణుగుప్తుఁడు, "రాజా! నీ యతివినయ మటుండనిమ్ము; నిమిత్తములేక పిలువ నంపుట గలదా?" అనిన, "స్వామీ! కౌముదీమహోత్సవ మేల నిలిపితి"రనెను.

ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు, "నీవు ముఖ్యముగా మమ్మాక్షేపించుటకై పిలువఁబంచితివి. నీకీ ప్రయోజనముఁ గూర్చిన విచారమేల? దేనిని విచారింపవలసినను మేము గలము" అని చెప్పుచుండఁగాఁ గోపమాఁగలేక, రాజు మోమూనలకుఁ ద్రిప్పెను. అదియే తగిన తరుణమని రాక్షసునిచే నియమితులైన కలశక విజయులు రాజు నెదుట నిలిచి, "చంద్రగుప్త మహారాజా! గజముల కుంభస్థలములను జీల్పఁజాలు ఖర నఖరములను క్షుద్రమృగములు లాగుచుండఁగా మృగరాజ మెట్లు సహింపనొల్లదో యటులే యల్పులచేత

నగు నాజ్ఞాభంగ మభిమానధనుఁడగు మహీపతి యోర్వ లేఁ''డని పొగడిరి. విష్ణుగుప్తుఁ డా పలుకులు విని ''ఆహా! రాక్షసుఁ డిచ్చట సైతము తన భేదతంత్రము ప్రవేశపెట్టి యున్నాఁడుగదా!'' అని యచ్చెరువొందుచుండఁగాఁ జంద్ర గుప్తుఁడు ''ఓయి వైతాళికా! ఈ స్తోత్రపాఠకులకు వేయేసి నిష్కములిప్పింపుము'' అని యానతిచ్చెను. విష్ణుగుప్తుఁ డా మాటలు విని మిక్కిలి కోపించి ''వృషలా! నిష్కారణముగ నిట్లు వెచ్చపెట్టరాదు. వైతాళికా! ధనమార్జించుశ్రమ మీ రాజున కేమి దెలియును? వీరికి ధన మొసఁగవలదు'' అనెను.

చంద్రగుప్తుఁ డా మాటలు విని ''స్వామీ! ఇది యేమి? నా మాట సాగనీయక యడ్డము వచ్చెదరు; ఇటు లైనచో నిది ప్రభుత్వము కాదు. కారాగృహవాసముగ భావించెదను'' అనెను. విష్ణుగుప్తుఁ డందులకు 'నా మాటలు రుచింపవేని యీ రాజ్యభారము నీవే భరింపుము' అనెను. చంద్రగుప్తుఁ డా మాటలు విని ''స్వామీ! అటులే కానిండు; నేనే నిర్వహించెద'' ననెను. అప్పుడు విష్ణుగుప్తుఁడు ''వృషలా! నాకు భారము తగ్గెను; ఉత్సవము నిలుపుటచేత నే కార్యము చెడెను? అది యొక దోషమా?'' అనెను. అందులకు రాజు ''ఔను, నా యాజ్ఞకు భంగ మొనగూర్చుటే దోషమగును'' అనెను.

విష్ణుగుప్తుఁడు ''వృషలా! నీ యాజ్ఞను మేము గొనసాగింపకుండుటే నీ కీర్తికి వన్నెదెచ్చుట యగును'' అని యొక లేఖ నతని కిచ్చి 'చదివికొను' మనెను. చంద్రగుప్తుఁ డా యుత్తరము చదివికొని, యీ యదనున వాక్కలహము

పెంచవలసినదను యజమానుల కోరిక తెలిసికొని "స్వామీ! సర్వానర్థములకుఁ గారణభూతుఁడైన మలయకేతువు నిచ్చట నుండునప్పుడే నిగ్రహింపక యుపేక్షించితిరి; రాక్షసా మాత్యుని పురమునందే నిలిపికొనక జారవిడిచితిరి. మీ కంటె రాక్షసుఁడే యనేకవిధముల బుద్ధిశాలి యనవలయును" అనెను ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు "రాజా! రాక్షసుఁడు బుద్ధిశాలి యనుటచే మేము బుద్ధిహీనులమని తోఁచెనో? బుద్ధిమంతుఁడయి యతఁడు చేసిన మేలేమి?" అనెను.

అందులకుఁ జంద్రగుప్తుఁడు "స్వామీ! రాక్షసుఁ డీ పురమున నిలిచి మిమ్మెవ్వరిని లెక్కగొనక తన నీతిశౌర్య ములచే మనకు ముందువెన్కలు దోఁచని విధమునఁ దొట్రి ల్లఁజేసి కష్టపెట్టెను" అనెను. ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు నవ్వి, 'ఓయి వృషలా! ఇంతమాత్రమునకా మెచ్చుకొంటివి? నేను నీకీ రాజ్యాధిపత్యము సంపాదించిపెట్టినట్లు రాక్షసుఁడు నిన్ను నిరాకరించి తా నభిమానించిన మలయకేతువునకీ రాష్ట్రాధిపత్య మొసఁగఁ గలఁడో?" యనెను. చంద్రగుప్తుఁ డా మాటలు విని "స్వామీ! నాకీ పదవి నందులను విద్వే షించిన దైవమువలనఁ బ్రాప్తమయినది కాని యితరుల కిది శక్యమగునా?" అనెను. విష్ణుగుప్తుఁడు కనలి, "ఓయి వృషలా! మాటకు మాట పెంచుటచేతఁ బ్రయోజనమేమి? మాకంటె రాక్షసుఁడే బుద్ధిశాలియని తోఁచిన పిదప, ఈ శస్త్రముతో మాకేమిపని? దీని నతని కొసఁగి యతని ముఖ మున నే సర్వకార్యములను జరిపికొనుము" అని ప్రాధాన్య శస్త్రము చంద్రగుప్తు నెదట నిడి సభనుండి లేచిపోయెను.

## రాక్షస మలయకేతువుల సంవాదము

రాక్షసుఁ డంపిన చారుఁడు పాటలీపురము సంగతులు దెలిసికొని పర్వతరాజ్యముఁ జేరెను. శకటదాసును గూర్చుండఁబెట్టుకొని విష్ణుగుప్తుఁడు తన కెట్లు చిక్కునో యని రాక్షసుఁడు కార్యాలోచనము సేయుచుండెను.

అట్టియెడ చారుఁడటకు వచ్చెను. పాటలీపురమునుండి వాఁడు వచ్చినసంగతి భాగురాయణుఁడు విని మలయకేతువును బిలిచికొని రాక్షసుని గృహమునకుఁ బోయి దాఁగి యుండి వారల సంభాషణమును వినఁదొడఁగెను.

చారుఁడు.- స్వామీ! నేను పాటలీపుర మేఁగి స్తుతి పాఠకులతోఁ జెప్పితిని. వారు మీరు సెలవిచ్చినట్లు చేసిరి. మీరు సంకల్పించిన కార్యము ఘటిల్లెను.

మలయ.- మిత్రుఁడా! సంకల్పించిన కార్య మనిన నేమి?

భాగు.- రాజకుమారా! ఇంతమాత్రమునఁ దెలిసికొనుటకుఁ గాదు; ఇఁక నేమి చెప్పునో విందము.

చారు.- కార్య మెట్లు ఘటించెనందురా? వినుఁడు. చంద్రగుప్తుఁడు కౌముదీమహోత్సవము జరుపవలయునని పురమునఁ జాటఁ బంచెను. విష్ణుగుప్తుఁ డది జరుపరాదని నివారించెను. అంత చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని రావించి మా యాజ్ఞాభంగ మేల యొనర్చితి రని యడిగెను. అట్టియెడ స్తుతిపాఠకులు చంద్రగుప్తునిఁ బొగడి క్రోధాగ్నిరవులుకొల్పిరి. కావున నతఁడు క్రుద్ధుఁడై ప్రసంగవశమున "అమాత్యరాక్షసునికంటె గుణాఢ్యులు గలరా?" అని మిమ్ము మిక్కుటముగ

ప్రశంసించెను. విష్ణుగుప్తుని ప్రాధాన్యశస్త్రమును సైతము దీసికొనఁగా నతఁడు ఖిన్నుఁడై సభనుండి లేచిపోయెను.

మలయ.- భాగురాయణా! చంద్రగుప్తుఁడు పొగడుట చేత నమాత్యునెడ వాని కభిమానము గలదందువా?

భాగు.- రాజపుత్రా! పొగడుటచేతనే కాదు; విష్ణుగుప్తుని శస్త్రమునుగూడఁ దీసికొనెను.

రాక్ష.- అయిన, చంద్రగుప్తుని కోపకారణము కౌముదీ మహోత్సవము నిలుపుటయే కదా!

చా.- స్వామీ! మిమ్మును మలయకేతువును పాటలీపురమున నిలిపికొనక పోవుటయును.

రాక్ష.- శకటదాసా! ఇఁకఁ జంద్రగుప్తుఁడు నాకు లోఁబడెను. చందనదాసు బంధమును ద్వారలోనే తీఱును. నీవు నీ కుటుంబమును జూడఁగలవు.

మలయ.- మిత్రమా! 'చంద్రగుప్తుఁడు నాకు లోఁబడెను' అనుట కేమి యర్థము?

భాగు.- 'విష్ణుగుప్తుని స్థానమందుఁ దా నుండి చంద్రగుప్తుని లోఁబఱచుకొనవచ్చుననుటే దీని కర్థము.

రాక్ష.- ఓరీ! విష్ణుగుప్తుఁ డింకను పాటలీపురమునం దున్నాఁడా?

చా.- స్వామీ! విష్ణుగుప్తుఁడు తపోవనమునకు వెళ్లుచున్నాఁడని వర్తమానము వినవచ్చినది.

రాక్ష.- తొల్లి నందకృతావమాన మోర్వని విష్ణుగుప్తుఁ డిప్పుడు చంద్రగుప్తునివలనఁ బొడమిన యవమాన

మోర్చి తపోవనమునకుఁ బోవుచున్నాఁడనుట సంగతముగ నున్నదా ? విష్ణుగుప్తుఁడు తపోవన మేగుట నిజమా ?

చా.- స్వామీ ! విష్ణుగుప్తుఁడు తపోవన మేఁగుట నిశ్చయమై యుండవచ్చును. ఏలయనఁగా తన యాజ్ఞను విష్ణుగుప్తుఁడు భంగపఱచుటచేతఁ జంద్రగుప్తుఁ డతనిని సచివ పదమునుండి తొలఁగించెనుగదా !

భాగు.- రాజకుమారా ! నీవు విన్న సంభాషణముచే రాక్షసునకుఁ జంద్రగుప్తునెడల నభిమానమున్నదని తెలిసెనా?

ఆ మాటలకు మలయకేతు వేమిచేయుటకును దారి యేర్పడక, రాక్షసుని గుణపరిశీలనము చేయకయే యెద్దియు నిశ్చయింపరాదని తలపోయుచుండెను. అట్టియెడ నెవరో లోపలనుండి వెలుపలకు వచ్చు సవ్వడి విని భాగురాయణ మలయకేతువులు లోపలఁ బ్రవేశించిరి. రాక్షసుఁడు "కుమారా ! ఏ పనిమీఁద వచ్చితివి ?" అని యడిగెను.

మలయ.-మీకుఁ దలనొప్పి యని విని చూడవచ్చితిని.

రాక్ష.- కుమారా ! నీకు రాజాధిరాజను పేరు కలుగు పర్యంతము నా తలనొప్పి యటులే యుండును.

మలయ.- స్వామీ ! మీ రభిమానించియుండఁగా నా కిది లభించుట యెంతమాత్రము ? పగవానిమీఁదికి వెడలవలయును; తామసించుటవలనఁ గార్యము సిద్ధించునా ?

రాక్ష.- కుమారా ! కార్యసిద్ధి కేల లోపము గలుగును ? నీవు శూరసైనిక పరివృతుఁడ వగుటచేతను, విష్ణుగుప్తుఁ డధికారభ్రష్టుఁడై చంద్రగుప్తుని విడిచి పోవుటచేతను,

మంత్రిరహితుఁడైన మౌర్యుఁడు క్రొత్తరాజగుటచేతను, నీకు జయము ధ్రువము.

మలయకేతువు "స్వామీ! మీరే గౌడదేశమున మన సేనలు విడియునట్లు లానతిండు" అని చెప్పి తన భవనమునకుఁ బోయెను.

---

## రాక్షస నిరాసము

పాటలీపురముపై సైన్యములు మిక్కుటముగ విడియుచుండినవి. అవమానితుఁడై పాటలీపురమునుండి వెడలఁగొట్టఁబడిన క్షపణకుఁడు పర్వతరాజ్యమునకు వచ్చి యమాత్యరాక్షసునింటి వాకిట నిలిచెను. అట్టియెడ రాక్షసుఁడు వాని రాఁకను తెలిసి లోపలకు వచ్చి కూర్చుండుమని చెప్పి "అయ్యా! దండయాత్రకుఁ దగిన సుముహూర్త మొకటి నిర్ణయింపు" మని యడిగెను. ఆ మాటలకు జీవసిద్ధి "అమాత్యశేఖరా! నేఁటి మధ్యాహ్నము మిక్కిలి యనుకూలించి యుండుటచే అపుడు వెడలవచ్చును" అనెను. అప్పుడు రాక్షసునకుఁ దొంటి సంగతి స్మరణకు రాఁగా సందేహించి "అయ్యా, క్షపణకా! మొకట మా విజయయాత్రకు లగ్నమిడినట్లు చేయకుము" అనెను. ఆ మాటలకు వాఁడు "అమాత్యా! నీవే పోయి యే దైవజ్ఞునయిన నడిగి తెలిసికొనుము. నే నెక్కడకైనను వెడలిపోయెదను" అనెను. అప్పుడు రాక్షసుఁడు 'అయ్యా! ఇంతమాత్రమునకు నీకుఁ గోపమేల?' అనెను.

అందులకు వాఁడు "నాకు నీమీఁదఁ గోపమేల? నా మాట పనికిరానిచో నేనే పోయెద" నని యా చోటు

విడిచి వెడలిపోయెను. అప్పుడు రాక్షసు నాప్తునివలె నాశ్రయించియున్న సిద్ధార్థకుఁడు "ఇఁక నాలస్యము చేసిన యెడలఁ దొంటికంటె నెక్కువగఁ గూడియున్న యీ సైన్యములచే గౌడదేశము హతమై క్షోభించును. కావున నిప్పుడే నా పనికిఁ బ్రయత్నింపవలయును" అని తలపోసి శకటదాసు నొద్దకుఁ బోయి "మిత్రమా! నాకుఁ గన్యనిచ్చిన మామ యిల్లీ సమీప గ్రామమున నున్నది. నా భార్య కుసుమపురి యందుండనొల్లక పుట్టినింటికి వచ్చియున్నదఁట; చూడఁ బోయెదను. రాక్షసుఁడు నాకు బహూకరించిన భూషణముల పెట్టె నిమ్ము. దానిని నా భార్యకిచ్చి సంతుష్టురాలినిఁ జేసి వచ్చెదను" అనెను.

'నీ యిచ్ఛవొప్పనఁ జేయు'మని యాతఁ డా పెట్టె నిచ్చివేసెను. ఆతఁడు దానిని దీసికొని, తొల్లి తనకు విష్ణు గుప్తుఁడు, శకటదాసుచే వ్రాయించియిచ్చిన లేఖనుగూడఁ బదిలముచేసికొని యందుండి వెడలిపోయెను. పర్వతరాజ పురము విడిచి వెళ్లునట్టి విదేశీయులకు రహదారిచీటి యుండవలయు నని రాజశాసన మేర్పడియున్నది.

అట జీవసిద్ధి, భాగురాయణుఁడున్న చోటుఁ జేరి "ధర్మిష్ఠులకు ధర్మసిద్ధి యొనగూడనిమ్ము" అని యొక యాసనముపైఁ గూర్చుండెను. భాగురాయణుఁ డతనిఁ జూచి "ఇతఁడు రాక్షసునకు స్నేహితుఁడైన జీవసిద్ధి" అని పోల్చుకొని, "అయ్యా, జీవసిద్ధీ! మీరుఁ గుశలమా?" అని ప్రశ్నించెను. ఆ మాటలకు జీవసిద్ధి "అయ్యా! మీ క్షేమమే మా క్షేమము" అని తెలిపెను. అప్పుడు లోపలనున్న

మలయకేతువు "ఇప్పుడు మన సైన్యములు పాటలీపుత్రమును ముట్టడింప యత్నించుచున్నవి. రాక్షసుని సతీసుతులా నగరమందున్నారు. ఆయన సంధికార్యమునకు లోఁబడునో లేక తన వాగ్దానానుసారమే కార్యము సాధించునో? ఈ విషయము భాగురాయణునితో నాలోచింపవలయు"నని వచ్చి యూతఁడు జీవసిద్ధితో సంభాషించుటను దాఁగియుండి వినుచుండెను. భాగురాయణుఁ డది తెలిసి "ఇప్పుడు మలయకేతువునకు రాక్షసునెడఁ గ్రోధ మెచ్చునట్లు చేసెద" నని నిశ్చయించుకొని క్షపణకునిఁ జూచి "అయ్యా! క్షపణకా! రాక్షసుని పనిమీఁద వెళ్లుచు రహదారిచీటిని గోరి వచ్చితివా?" అనెను.

క్షపణ.- భాగురాయణా! వంచకుఁడైన రాక్షసునితో నాకేమి పని? అతని నామోచ్చారణమే దోశమందుండదో యూచోటికి పోవుచున్నాను.

భాగు.- క్షపణకా! రాక్షసుఁడు మీకు మిత్త్రుఁడు గదా! అతనియెడ మీకేల యింతకోపము? అతఁడు మీకుఁ జేసిన యపకారమేమి?

క్షపణ.- వాని దోషమేమున్నది? వాని స్వభావమే యట్టిది; అది చెప్పుకొనఁదగిన విషయముకాదు.

భాగు.- నీ వీ యంశము చెప్పవేని నీకు రహదారిచీటి దొరకదు.

క్షప.-అది యంత రహస్యముకాదు గాని, చెప్పఁదగని ఘాతుకకార్యము. నీకు వినఁ గోరిక గలదేని చెప్పెదను. నేను రాక్షసునకు మిత్త్రుఁడనై యుంటిని. అతఁడు, పర్వతరాజు నంపులను సంహరింప నేనలతో విచ్చేసినాఁ డను వైరముచేత

విషకన్యను నాతోఁ బంపి యా రాజును జంపించినాఁడు. కొన్నాళ్లకుఁ బిమ్మట విష్ణుగుప్తుఁడు 'పర్వతరాజును జంపించిన నేరమునకు నేను దోషపడితి'నని నన్నుఁ బట్టి సభలో నవమానించి దేశభ్రష్టునిఁ జేసెను. నా కాశ్రయ మెక్కడ కనఁబడకపోఁగా నిటకు వచ్చి రాక్షసునే యాశ్రయించితిని. ఇప్పటికైనను దెలివితో మెలఁగక, కొందఱు రాజులను వశపఱచికొని మలయకేతువునకు ద్రోహియై చంద్రగుప్తుని నభిమానించుచున్నాఁడు. ఈ గుట్టు దెలిసి యిట నుండరాదని వెడలిపోవుచున్నాను" అనెను.

పొంచియుండి వారి సంభాషణను వినుచుండిన మలయకేతువు తండ్రిని దలఁచికొని వెతనొందుచు రాక్షసునెడ కోపము వహించినవాఁడై భాగురాయణునొద్దకు వచ్చి "అయ్యా, మిత్రుఁడా! ఈ క్షపణకుని మాటలచే నా తండ్రి మరణవృత్తాంతము జ్ఞప్తికివచ్చి దుఃఖము కలుగుచున్నది" అనెను. అప్పుడు భాగురాయణుఁడు "రాజపుత్రా! కడచినపనికిఁ జింతిల్ల నేల? నందవధానంతరము వృద్ధరాజునకు స్వీకృతపుత్రునొనగూర్చి నందవంశము నిలుపఁ దలఁచిన రాక్షసునకుఁ బర్వతరాజును విష్ణుగుప్త చంద్రగుప్తులును శత్రువులేయైరి. వృద్ధరాజు మరణింపఁగానే రాక్షసుఁడు మనల నాశ్రయించెను. నందరాజ్యము మనకుఁ దక్కినపిదప రాక్షసుని బహుమానింపవచ్చును" అనెను. ఆ మాటలకు మలయకేతువు కోపముడిగి యా క్రోధమువిడిచి సగరుచేరెను.

మఱునటిదినము రాత్రి సిద్ధార్థకుఁడు భయపడుచున్నవానివలె నటించుచు, భటులను మీఱి వెళ్లుటకు

యత్నించుచుండఁగా, కావలివారు వానిని జూచి "వీఁడెవఁడో దొంగ! ఒక యుత్తరమును సగము పైకిఁ గనిపించుచున్నది" అని వానిని బట్టుకొనిపోయి మలయకేతువుతో సంభాషించుచున్న భాగురాయణు నెదుట నిలిపిరి. మలయకేతువు వానిని జూచి, "వీఁ డెవఁడో ఎవని సేవకుఁడో అడుగుము" అని భాగురాయణునితోఁ జెప్పెను.

సిద్ధార్థకుఁ డా మాటలకు "చిత్తము, నేను రాక్షసామాత్యుని సేవకుఁడను" అనెను. "అటులైన నీ విటకు వచ్చి రహదారిచీటి నేల పొందలేదు?" అని భాగురాయణుఁ డడుగఁగా "స్వామీ! పని తొందరనుబట్టి పోవుచుంటిని" అని పలికెను.

అప్పుడు మలయకేతువు "వీనియొద్ద నున్న లేఖను దీసి చూడుము" అనెను. భాగురాయణుఁడు దానిని జూచి "రాజపుత్రా! దీనిపై రాక్షసునిముద్ర యున్నది" అనెను. మలయకేతు వా యుత్తరమును విప్పి చదువు మనఁగా భాగురాయణుఁ డిట్లు చదివెను.

"శ్రీ శ్రీ ప్రదేశమునందున్న యుత్తమునకు స్థలాంతరవాసి యగు నొక పురుషుఁడు సేయు విన్నపములు — మాకు శత్రువగు నొకని నిగ్రహించి యతఁడు వినుచుండఁగా మమ్ము పొగడిన సంగతులు మాకుఁ బరోక్షమున వినవచ్చినవి; ఆభరణములతోడ మంజూషలు మూఁడును చేరినవి; ఇచ్చట మన కాప్తులయినవారు సమయము కనిపెట్టుకొని మన కార్యమునకు సిద్ధముగా నున్నారు. మన కార్యము

పూర్తిన్మైన పిదప మాంట ; కొందఱకు శత్రుదళములపై నాశ గలదు. తక్కినవారికి రాజ్యముం దభిలాష గలదు. ఈ యుత్తరముతోం బంపియున్న భూషణములను జూచుటచేత, నా కిచటం గల స్వాతంత్ర్య మిట్టిదని తోంచగలదు. తక్కిన సంగతులు మా కాప్తుండయి యీ యుత్తరము దెచ్చు పురుషునివలనం దెలిసికొనవచ్చును.

మలయకేతు వా జాబులోని సంగతులు విని "ఓరీ! నీ యొద్దనున్న భూషణములపెట్టెం జూపు"మనెను.

వాండు లేదనుచుం దొట్రుపడుచు భయముచే వడంకుచుం దుదకు నగలపెట్టెను దిగువం బడవైచెను. భటులు దానిం దెచ్చి మలయకేతువునెదుట పెట్టంగా భాగురాయణుండు దానిని దెఱచి యందలి భూషణముల దీసి మలయకేతువునకుం జూపెను. అతం డవి చూచి తా నిదివఱకు రాక్షసున కిచ్చిన యాభరణములని తెలిసికొనెను. పిదప మలయకేతువు సిద్ధార్థకునిం జూచి "ఓరీ! యదార్థము పలుకుము" అనెను.

సిద్ధార్థకుండు భీతునివలె నటించుచు "స్వామీ! మన్నింతురా? ఉన్నదున్నట్లు పలికెద" ననెను.

ఆ మాటలకు భాగురాయణుండు "ఓరీ! భయము లేదు. చెప్పుము" అనెను.

సిద్ధార్థకుండు "స్వామీ! అమాత్యరాక్షసుండు ఈ పెట్టెను, లేఖను జంద్రగుప్తున కిచ్చి రమ్మని పంపెను; నే నతని దూతను" అని చెప్పెను.

మలయకేతువు వాని మాటలు విని "ఓరీ! ఈ విష

యము మాకు విదితము. అమాత్యరాక్షసుఁడు చంద్రగుప్తునితోఁ జెప్పుమని నీకుఁ జెప్పిన సంగతి యేమి?" అనెను.

"స్వామీ! 'కొందఱు సామంతరాజులు కలూతపతి మొదలగువారు నా కాప్తులుగ నున్నారు. వారు మలయకేతువున కాప్తులయినట్లు మెలఁగుచు మీ కుపకరింప సమయము నిరీక్షించుచున్నారు. కొన్నాళ్లలోనే కార్యము సిద్ధించును. పిదప వారి యభీప్సితమును గొనసాగింపవలయును' అని యా రాజుతో విన్నవించున ట్లానతిచ్చిరి" అని సిద్ధార్థకుఁడు చెప్పెను.

ఆ మాటలకు మలయకేతువు "ఓహో, కలూతపత్యాదులు కూడ రాక్షసునితోఁజేరి నాకు ద్రోహము దలఁచెదరా? ఓరీ! రాక్షసామాత్యుఁ డిప్పు డేమి సేయుచున్నాఁడో చూచి రమ్ము" అని యొక సేవకునిఁ బంపెను. వాఁడు వెళ్లి వచ్చి, "రాజపుత్రా! రాక్షసామాత్యుఁడు నేను వెళ్లినప్పుడు పింగళుఁడను దూత కిట్లు లాజ్ఞ యిచ్చుచుండెను. "గౌడదేశముమీఁదికి వెడలుటకు సైన్యములన్నియు సిద్ధముగ నుండవలయును; కులూతాది సామంతరాజపంచకము రాజపుత్రునిఁ బరివేష్టించి స్వసైన్యములతో రావలయును. మేము వెన్నంటివత్తుము "అని చెప్పెను.

ఈ మాటలు వినఁగానే మలయకేతువు సందేహము దృఢమయ్యెను. భాగురాయణునిఁ జూచి, "మిత్రమా! అమాత్యుని నేర్పుఁ గంటివా! ఈ దూత తెచ్చిన లేఖతో సరిపోవుచున్నది. "ఓరీ! నీవే పోయి రాక్షసామాత్యునిటకుఁ బిలుచుకొని రమ్ము" అని వానిని బంపెను.

వాఁడు రాక్షసామాత్యుని గృహమునకుఁ బోయి "రాజకుమారుఁడు మిమ్ము బిలుచుకొనిరమ్మని పంపెను. విచ్చేయుఁ"డని విన్నవింపఁగా, అమాత్యరాక్షసుఁడు వెనుక వర్తకవేషధారులు తన కమ్మిన భూషణములు ధరించి వచ్చి "అయ్యా, రాజకుమారా! సైన్యసన్నాహ కార్యమునందు మగ్నుఁడనై యుంటిని; కాఁబట్టి నిన్నుఁ జూచుట కవకాశము గలుగలేదు" అనెను.

"అమాత్యవర్యా! ఇప్పుడు పాటలీపురమునకు వెళ్లువా రెవరైనఁ గలరా?" అని మలయకేతువు ప్రశ్నించెను. అందుల కమాత్యుఁడు "కుమారా! ఇప్పుడు మనమే వాహినీ సమేతులమై వెళ్లవలసిన వారము" అని బదులుపలికెను.

"అటులైన నీయుత్తర మెవరిది? దీనిమీఁది ముద్ర యెవరిది? ఈ యుత్తరములోని యభిప్రాయ మేమి? చూచి చెప్పుడు" అని యాలేఖను మలయకేతు వతని చేతి కిచ్చెను.

రాక్షసుఁ డాలేఖను దీసి చూచి "ఇది పగవారి కపట లేఖనము; దీనిమీఁది ముద్రయు నట్టిదే" అనెను.

"అది యటుండనిండు. ఈ పెట్టెలోని భూషణము లెవరివి?" అని వానిని తీసి మలయకేతువు రాక్షసునకుఁ జూపఁగా "అక్కటా! ఈ భూషణములు మలయకేతువు నా కిచ్చినవి; నేను సిద్ధార్థకున కిచ్చితిని. ఈ యుత్తరములోని యభిప్రాయమును జూడఁగా చంద్రగుప్తుఁడు మొదట నాకు భూషణములఁ బంపినట్లును, అందుకు బదులుగా నే నీ భూషణములను బంపి యధికారమును గోరినట్లును, ఇందలి సామంత రాజ పంచకమును నేనును మలయకేతువుం బట్టి, చంద్ర

గుప్తున కిచ్చునట్లును వ్యక్తమగుచున్నది. ఈ ద్రోహము విష్ణుగుప్తునివలన నైనది. దీనివలన నాకును నేవురు సామంత రాజులకును విపత్తు గలుగుట నిజము'' అని తలపోయుచు మిన్నకుండెను.

అప్పుడు మలయకేతువు ''అయ్యా! భూషణములను జూచుచు మిన్నకున్నారేమి?'' అని ప్రశ్నించెను.

అందులకు రాక్షసుఁడు ''కుమారా! ఇవి నీవు నా కిచ్చిన నగలు; ఒక సంతోష కార్యము నుద్దేశించి వీని నొక దూత కిచ్చితిని'' అనెను.

భాగురాయణుఁ డతని మాటలు విని ''మీరు ధరింప వలయునని యిచ్చిన రాజార్హభూషణములు మీ రల్పుల కొసఁగవచ్చునా? అది యటుండనిండు. ఈ యుత్తరముమీఁది ముద్రయుఁ బెట్టెమీఁది ముద్రయు మీవి కావా? ఈ యుత్తరము మీ విలేఖకుఁడైన శకటదాసుని వ్రాఁత కాదా?'' అని ప్రశ్నించెను.

అమాత్యరాక్షసుఁ డేమియు బదులుపలుకక యేమో తలపోయుచుండెను. మలయకేతువు చుఱచుఱఁ జూచుచు నతఁడు దొడిగియున్న భూషణములను గాంచి ''కంచుకీ! అమాత్యుఁడు ధరించిన భూషణములను జూడుము'' అనెను. వాఁడు ''చిత్తము; ఇవి మన పర్వతరాజు విజయార్థము వెడలినప్పుడు ధరించినవి'' అనెను. అపుడు రాక్షసుఁడు ''వీనిని వర్తకులయొద్దఁ గొంటిని'' అని నుడివెను. అంత మలయకేతువు ''అమాత్యవర్యా! చంద్రగుప్తుఁ డీ భూషణములను మీకొసఁగఁగా, వాని మూల్యమునకై వానికి నన్నే

యర్పింప యత్నించుచుంటిరి కదా!" అనెను. ఆ మాటలు విననోల్లక రాక్షసుఁడు 'శివశివా' యని చెవులు మూసికొనెను.

అప్పుడు మలయకేతు వతనిని జూచి "అయ్యా, అమాత్యా! అక్కడ చంద్రగుప్తుఁడు మౌర్యపుత్రుఁడు; ఇక్కడ నేను నీ మిత్రు పుత్రుఁడను. అక్కడ వాఁడు నీకు దయదలఁచి పెట్టవలయును; ఇక్కడ సర్వస్వాంత్ర్యములు వహించి నీవు నాకుఁ బెట్టవలయును. ఏమి గోరి వాని నభిమానించి యిట్టి ఘోరపాపమున కొడిగట్టితివి?" అనెను. రాక్షసుఁ డేమియు ననలేకపోయెను.

మలయకేతువు కుపితుఁడై "కృతఘ్నుఁడా! ఇది యెవరి దోషము! ఇప్పటికిని దప్పించుకొనఁ జూచెదవే" అనెను.

"ఇది దైవముయొక్క విలాసమేకాని యెవ్వరి దోషమును గాదు" అని యమాత్యుఁడు బదులు పలికెను.

ఆ మాటలకు మలయకేతువు మిగులఁ గోపించి "ఇది దైవవిలాసమా? లోభవిలాసము కాదేమో?" అని స్వహస్తాక్షరములతో నొక లేఖ వ్రాసి మడఁచి తన ముద్ర యుంచి యొక సేవకునితో 'శేఖరుని చేతి కిచ్చి ర'మ్మనెను. వాఁడు త్వరితగతిని బోయి శేఖరుని కా యుత్తర మిచ్చి యతఁడు వ్రాసి యిచ్చిన ప్రత్యుత్తరమును దెచ్చి మలయకేతువున కిచ్చి కులూతాది సామంతపంచకము సంహరింపఁ బడుటను జెప్పెను. పిదప మలయకేతువు రాక్షసునిఁ జూచి "అయ్యా! నీతో స్నేహము చేసినందుకుఁ బ్రయోజనముగఁ గౌలూతాదులు కూలిరి. నేను నివలె విశ్వాసఘాతకుఁడను

గాను; నిన్ను విడిచిపుచ్చెదను. నీవు చంద్రగుప్తునొద్దకే పొమ్ము. మిమ్ము నిగ్రహింప వెంటనే వచ్చుచున్నాము" అనెను. 'దూతను జంపరాదు కనుక, యజమానునితోడ వానిని దేశమునుండి వెడలఁగొట్టు'మని యానతిచ్చి రాజంతఃపురమునకుఁ బోయెను.

రాక్షసుఁడందుండి ఖిన్నుఁడై వెడలిపోవుచు "స్వామిభక్తితో నెన్నివిధములఁ బాటుపడినను నవియెల్ల వ్యర్థములయ్యెను. నా నిమిత్తము నిరపరాధులగు సామంతరాజులేవురు హతులైరి; హుటాహుటిని బోయి చంద్రగుప్తుని వధింతమన్నఁ దుదకెట్లు పరిణమించునో!" అని తలపోయుచు కడకుఁ దన కుటుంబమువారికై ప్రాణము లర్పింపనున్న చందనదాసు నే యుపాయముచేతనైనఁ దప్పించుట యిహపర సాధకమని నిశ్చయించుకొని పాటలీపురాభిముఖుఁడై పోయెను.

---

## రాక్షస విష్ణుగుప్తుల సమాగమము

రాక్షసుఁడు వెడలిపోయిన తరువాత భాగురాయణుఁడు విష్ణుగుప్తుని నీతికుశలతకు మిక్కిలి యచ్చెరువొందెను. భాగురాయణుని సంకేతముచొప్పున భద్రభటాదులు కావలివారిని బంధించి మలయకేతు వున్నయెడకుఁ బోయి "అయ్యా! అమాత్యరాక్షసుని వాగ్దానముచొప్పున పాటలీపుత్రము కైవసమాయెను. మిక్కిలి జాగరూకతతో మిమ్మును దేర నందలముఁ బంపెను" అనిరి.

ఆ మాటల కాతఁడు, తా నాపదలోఁ జిక్కినట్లు

భావించి, "అయ్యా! మన భాగురాయణుఁ డెక్కడ?" అని వారి నడిగెను. అందులకు వారు, "కుమారా! అతఁడు రాక్షసునితోఁ జేరి యప్పుడే వెడలిపోయె" ననిరి.

"అమాత్యుఁడు మమ్ము రెండని మిమ్ముఁ బంపెనా? మిత్రులైన మీకెల్లరకు నీ కార్యము సమ్మతమైనచో నటులే చేసెద" నని మలయకేతువు చెప్పెను. ఆ మాటలకు భద్రభటాదులు 'నీ క్షేమము మా క్షేమమువంటిదగును' అనిరి. అప్పుడు మలయకేతువు కొంత యూఱటఁ జెంది పల్లకీలోఁ గూర్చుండెను. పిదప వారు, అందున్న రాజపుత్రపరివారము వారిని బట్టి కావలియందుంచి, మలయకేతువు నందలమును బరివేష్టించి యా నగరము విడిచి పాటలీపురాభిముఖులై పయనమైరి.

సిద్ధార్థకుఁడు, రాక్షసునిమార్గ మనుసరించి వెంబడినే పోవుచు పాటలీపురము ప్రవేశించెను. పిమ్మట విష్ణుగుప్తుని పర్ణశాలను జేరి యతనికి నమస్కరింపఁగా నతఁడు "సిద్ధార్థకా! క్షేమముగా వచ్చితివా? కూర్చుండుము; నీవు పూనిన కార్య మేమయ్యెను? రాక్షసుని వృత్తాంత మేమి?" యని యడిగెను.

అందులకు వాఁడు "స్వామీ! మీ యానతిచొప్పన నేను బూనిన కార్యమంతయుఁ గొనసాగెను. రాక్షసుఁ డెటకుఁ బోవుటకుఁ దోఁచక ఖడ్గపాణియై వచ్చి యీ పుర బాహ్యోపవనమున విడిసెను" అని విన్నవించెను. విష్ణుగుప్తుఁ డా మాటలు విని పరమ సంతోషభరితుఁడై, వానిని వెంటఁబెట్టుకొని చంద్రగుప్తుఁ డున్న యెడకుఁ బోయెను.

చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని జూడఁగానే లేచి, సాష్టాంగ నమస్కారముచేసి యున్నతాసనమునఁ గూర్చుండఁబెట్టెను. అప్పుడు విష్ణుగుప్తుఁడు "చంద్రా! నీతో నాఁడు వాక్కలహము పెట్టుకొనిన తంత్రమునకుఁ బ్రయోజన మీ సిద్ధార్థకుఁడు చెప్పును విను" మనెను. జరిగిన వృత్తాంతమంతయు సిద్ధార్థకుఁడు చంద్రగుప్తునకుఁ జెప్పఁగా నతఁడు విని "మీ సంకల్పమునకు విరుద్ధముగ జరుగునా!" అనెను.

అంత విష్ణుగుప్తుఁడు "కుమారా! పర్వతరాజువలన నీవు పొందిన యుపకారమును స్మరించి యిప్పుడు చెఱకు జిక్కి యిటకు వచ్చు మలయకేతువు విషయమునఁ గృతజ్ఞుఁడవై మెలఁగుచు, బహుసమ్మానములచే నతని ఖేదముఁ బోకార్చి నీస్వాధీనమం దుంచికొనుము" అని యానతిచ్చెను.

పిదప విష్ణుగుప్తుఁడు సిద్ధార్థకునిఁ జూచి "కొంత కార్యశేషమున్నది; నీవే నిర్వహింపవలయును" అని యతని చెవిలోఁ గొన్ని మాటలు చెప్పి పంపివేసెను. పిమ్మట భాగురాయణుఁ డటకు వచ్చి దూరమున నిలుచుండి విష్ణుగుప్తునకు మ్రొక్కఁగా నతఁడు "అయ్యా, సేనాధిపా! నియమించిన విధమునఁ గార్యము నిర్వహించి క్షేమముగ వచ్చి చేరితివా? చంద్రగుప్తునకు మీవంటి యాప్తు లుండఁగా నెద్ది యసాధ్యమగును?" అని సన్మానించి "సేనాపతీ! ఇటకుఁ దేబడిన మలయకేతువునకుఁ దోడుగ నీవే యుండి యవమాన దుఃఖము లేకుండఁజేయుము" అని యానతిచ్చి పంపివేసెను.

అంత సిద్ధార్థకుఁడు విష్ణుగుప్తుని యానతిచొప్పున, ఒక చారుని రాక్షసుఁడున్న వనమునకుఁ బంపి, తాను

శూలము స్థాపించియున్న చోటికిఁ జందనదాసుని బిలుచుకొని వచ్చుటకై పోయెను.

ఇట నుద్యానవనమందు రాక్షసుఁడు తన మిత్రుఁడైన చందనదాసు యోగక్షేమములఁ దెలిసికొనుటకు మార్గమేర్పడక తొట్రిలుచుండెను. అట్టియెడ, ఒకఁడటకు వచ్చి యొక వృక్షాగ్రమునకుఁ ద్రాడుకట్టి యురిపోసికొనుచు, దైవప్రార్థనము సేయుచుండెను. "వీఁడెవఁడో నావలెనే మిత్రనాశము చూడలేక ప్రాణము పరిత్యజించుచున్నాఁడేమో! వీని యాపద యెట్టిదో విచారించెద" నని దూరమున నిలిచి చూచుచుండిన రాక్షసుఁడు వానియొద్దకుఁ బోయి "అయ్యా! నీ వెవఁడవు? నీ కొనగూడిన యాపద యెట్టిది?" అని ప్రశ్నించెను.

పురుషుఁడు.- "అయ్యా, బాటసారీ! దురదృష్టవంతుఁడనైన నా వృత్తాంత మడిగెదవేల?" అని తన ఉరిని సవరించుకొనుచుండెను.

రాక్ష.- అయ్యా! అడుగుటకుఁ బదులు పలుకక ప్రాణములు పరిత్యజించెదవేల?

పురు.- నా మిత్రుఁడైన విష్ణుదాసుఁడు తన ప్రాణపదమైన చందనదాసు నరిదీయుటకుఁ జండాలురు తీసికొనిపోవుచుండఁగాఁ జూచి యతని వధకుముందే యగ్నిప్రవేశము చేయ నెటకో పోయెను. నే నా మిత్రవ్యసనముచేతఁ బ్రాణమును విడుచుచున్నాను.

రాక్ష.- ఆ చందనదాసుని కేల యట్టి యాపదగలిగెను?

పురు.- చందనదాసునకు రాక్షసుఁడను మిత్రుఁ

డొకఁడు గలఁడు. అతఁడాపన్నుఁడై దేశాంతరమేఁగుచుఁ దన సతీసుతులఁ జందనదాసునొద్ద దాఁచియుంచెను. విష్ణుగుప్తుఁ డిది తెలిసి చందనదాసుని రావించి రాక్షసుని కుటుంబమువారిని దన కప్పగింపు మనఁగా నతఁడందుల కంగీకరింపఁడయ్యెను; కావున, నతనికి శూలారోహణశిక్ష విధించెను.

రాక్ష.- అయ్యా! నీవు ప్రాణములు త్యజింపకుము. చందనదాసు నాపద తొలఁగును.

పురు.- స్వామీ! ఎట్లు?

రాక్ష.- 'ఈ ఖడ్గముచేత' అని యొరనుండి కత్తిదూసి జళిపించుచుఁ జెప్పెను.

ఆ చారుఁ డా మాటలు విని, "ఆహా! ఇతఁడు ఖడ్గముఖమునఁ జందనదాసును రక్షింపనున్నాఁడు; ఇతఁడు ఖడ్గమును బరిత్యజించునట్లు చేయవలయును" అని తలపోసి, అయ్యా! చందనదాసున కాపద్బాంధవు లయిన మీర లెవ్వరో తెలిపెదరా?" అనెను.

రాక్ష.- నన్ను రాక్షసామాత్యుఁ డందురు.

పురు.- స్వామీ! మీరు శస్త్రముఖమునఁ జందనదాసును విడిపింతు నంటిరి. దానివలన నతనికి క్షేమము గలుగదు. "ఖడ్గపాణు లెవరైనను వధ్యులకు దాపునఁ గానవచ్చిరేని తత్క్షణమే యా రాజద్రోహులను జంపి యా ఖడ్గధారులను బంధించి తేవలయునని శాసనము" అనెను. ఆ మాటలు విని రాక్షసుఁడు ముందువెన్కలు చూడక చేతనున్న ఖడ్గమును బారవైచి శూలమున్నచోటికిఁ బోవుచుండెను.

అట చందనదాసును శూలమున్నచోటికిఁ జండా లురు తెచ్చుచుండిరి. అతని సతియు సుతుఁడును బెక్కువిధములఁ బ్రలాపించుచు వెంబడినే వచ్చుచుండిరి. ఆ సమయమందు కటికవాండ్రు చందనదాసు భార్యాపుత్రులను జూచి "మీ రిటకుఁ బోండు; ఎవ్వరు నుండరాదు" అని గద్దించి పల్కుచుండిరి. రాక్షసుఁ డాధ్వని విని "కార్యము మించు నట్లున్నది!" అని అతివేగమున వచ్చి ఘాతుకులను జూచి "నిరపరాధియైన చందనదాసును జంపుట ధర్మమా? నా నిమిత్తము కద యతని కీశిక్ష విధింపఁబడెను; నేనే వచ్చితిని గాన నతని బంధవిముక్తునిఁ జేయుఁడు" అనెను.

చందనదాసు రాక్షసామాత్యునిఁ జూచి "అమాత్య వర్యా! ఇదివఱకు నేను పడినపాటు వ్యర్థముచేసి యిటు రా సాహసింపవచ్చునా? ఈ యల్పునినిమిత్తము బహుజన పోషకులయిన మీ రిటకు రానగునా? ఏమిపనిఁ జేసితిరి? మరణించిన నా యొక్కనికే కద నష్టము!" అనెను.

"చందనదాసా! నా చింత విముక్తము. నేను విహితమే చేసితిని" అని యా చండాలురఁ జూచి "ఓ ఘాతుకులారా! వెంటనే ఈతని విడిచిపుచ్చి నన్ను శూలమెక్కింపుఁడు" అని రాక్షసుఁడు పలికెను. ఆ మాటల కా ఘాతుకులు "స్వామీ! చందనదాసును విడుచుటకు మా కధికారము లేదు. మీరు మిత్రునెడలఁ బ్రేమ గలవారని, ప్రభువుల యనుమతిని బొందుఁడు. మే మీ చందనదాసు నీ చెట్టునీడ నిలిపి మీకు మార్గముఁ జూప వెంట వచ్చెదము" అనిరి. రాక్షసుఁ డందులకు సమ్మతించి, వారితోడఁ బోవుచు విష్ణుగుప్తుని పర్ణశాలను సమీపించెను. ఘాతుకులు పర్ణశాలకు వెలుపల

నున్న శిష్యునిఁ జూచి "అయ్యా! అమాత్యరాక్షసుఁడు తమ దర్శనముఁ గోరి యిటకు విచ్చేసె నని యజమానులతో విన్నవింపుము" అనెను. శిష్యుఁ డా సంగతి దెలుపఁగా విష్ణుగుప్తుఁడు పరమానందభరితుఁడై వెలుపలకు వచ్చి కటికవాండ్రను జూచి "హా! మహాసింహము మచ్చికపఱిచి దెచ్చినట్లు మీ రీ మహాత్ము నెట్లిటకుఁ బిలుచుకొనివచ్చితిరి?" అని యచ్చెరువొంది యడిగెను.

రాక్షసుఁ డతనిని జూచి "ఇతఁడే కుటిలుఁడు; దురాత్ముఁడైన విష్ణుగుప్తుఁడు" అని నిశ్చయించుచు, మరల నతని గుణములయందు దృష్టి నిలిపి, "అటు లనరాదు; సకల విద్యానిధి; తేజస్వియగు నితని నవమానించుటచేత నే నందులు నష్టులైరి. ఇతఁడు మహాత్ముఁడు" అని నిశ్చయించికొనెను.

విష్ణుగుప్తుఁడు "నేఁటి కితఁడు లభించెను" అని తల యూచుచు నతనిదాపునకు వచ్చి "స్వామీ! అమాత్యరాక్షస! చణకపుత్రుఁడను విష్ణుగుప్తనాముఁడ నైన నేను నమస్కరించుచున్నాను" అనెను.

రాక్ష.-అయ్యా, విష్ణుగుప్తా! చండాలు రంటుకొన్న నాకు మీవంటివారు నమస్కరింపవచ్చునా?

విష్ణు.- వీరు చండాలురుగారు.

రాక్ష.- అయితే వీరెవరు?

విష్ణు.- ఇదివఱకు మీ యొద్దనుండిన సిద్ధార్థకుఁ డతఁడు. అతని ప్రక్కనుండు సతఁ డింకొకచారుఁడు. శకటదాసును వంచించి కపటలేఖ వ్రాయించిన యతఁడు. మీకు మిత్రుఁడై మెలఁగుచుండిన జీవసిద్ధి యీ యింద్రశర్మ.

ఇతఁడు నా సహాధ్యాయి; నాచేఁ బంపఁబడిన భాగు రాయణాదులు మలయకేతువు నాశ్రయించి సమయముఁ గనిపెట్టియుండిరి. నేనే మీయెడకు నాభరణముల మంజూష లను మూఁటిని బంపితిని. మొదట నందులను వంచించిన మాసోపివాసి యితఁడు. నేఁడు మీ మ్రోల నురిపోసికొని చావ యత్నించునట్లు నటించినవాఁ డీచారుఁడు. చంద్ర గుప్తుఁడు సజ్జనుఁడును నిర్దోషియు నగుటచేతను నేను దపో వనమున కేఁగవలసి యుండుటచేతను, మీకు నతనికి సంధి పొసఁగించు నిమిత్తము నే నిన్ని తంత్రము లాచరింపవలసి వచ్చెను గాని మీయెడ నాకు ద్వేషము గలదా?'' అని యతని చేతిని బట్టుకొని లోపలకు బిలుచుకొనిపోయి యొక యాసనముపైఁ గూర్చుండఁబెట్టి తాను దర్భాసనాసీనుఁ డయి యతనిని జూచి యిట్టులనెను.

''అమాత్యవర్యా! నా యావద్వృత్తాంతము మీకు విన్నవించెదను. మీ హృదయములోని యితర చింతలను వీడి, లోకహితము బాగుగ నాలించి యుక్తమని తోఁచెనేని యట్లు జరుపవచ్చును. ఈ నవనందులు మీవంటి యుత్తమ సచివుల యభిమతముచొప్పున నడచుకొనకుండినది తమకు విదితమే. మీకుఁ జంద్రగుప్తునెడ దయయుండియు లోకాప వాదమునకు జడిసి నందులను బ్రేమించితిరి. అయినను ధర్మమున్నచోట జయము ధ్రువమగుటచే నెందును మీకు సరిరాని నేను బన్నిన యుపాయములు కొనసాగినవి. ఇఁక నీ చంద్రగుప్తుని నిమిత్తమాత్రుని గ నుంచుకొని సకలదేశాధీశు లను లోఁబఱచుకొని ధర్మమును పాలింపవలయును'' అనెను.

ఆ మాటలకు రాక్షసామాత్యుఁడు "స్వామీ! తపోధనా! మీ సూనృతవాక్యము వినుటచే నా మనఃకల్మషము దీఱెను. మీ యాజ్ఞానుసారమే యవలీల దుష్టనిగ్రహ శిష్టపరిపాలనములు సేయుచును" అనెను. అంత విష్ణుగుప్తుఁడు రాక్షసునితో చంద్రగుప్తునికడకు వచ్చి యుచితాసనమున నాతని గూర్చుండఁబెట్టి "కుమారా! మీ కులక్రమాగతులై సర్వతంత్రస్వతంత్రులై శౌర్యధైర్యాదియుద్ధునోపేతులై వెలయు రాక్షసామాత్యులు నందవంశోద్భవుఁడవని నీయందు దయయుంచి విచ్చేసియున్నారు. నీవు జనకునకుఁ దనయుఁడు, గురువునకు శిష్యుఁడు నెట్లు విధేయులై యుందురో యట్లు మెలఁగి కొంచెమైనను వారి యాజ్ఞోల్లంఘనము సేయక వీరివలన లభించు సామ్రాజ్యపదవి ననుభవింపుము. నేఁడు నేను ధన్యుఁడనైతి" ననెను.

అప్పుడు చంద్రగుప్తుఁడు "స్వామీ! మీ వాక్యము వేదవాక్యముగ భావించి మెలఁగెదను" అని విన్నవించి, ప్రధానశస్త్రము నమూల్య వస్త్రాభరణములు దెప్పించి యమాత్యునెదుట నిడి మ్రొక్కెను. రాక్షసుఁడు "విజయీభవ" అని చంద్రగుప్తు నాశీర్వదించి శస్త్రమును దీసికొనక యేమో తలపోయుచుండెను. అపుడు విష్ణుగుప్తుఁడు "స్వామీ, అమాత్యవర్యా! సభలోఁ జంద్రగుప్తుఁడు మిమ్ము మిక్కుటముగఁ బ్రశంసించియున్నాఁడు. ఇతనికి మీయెడ ననురాగ మధికము. మీరు వృద్ధరాజ పౌత్రుఁడని యీ చంద్రగుప్తునెడఁ బూర్వాభిమాన ముంచి వచ్చితిరా? లేక చందనదాసు క్షేమమును గోరి విచ్చేసితిరా?" అని ప్రశ్నించెను.

ఆ మాటలకు రాక్షసుఁడు, "ప్రభువును సందర్శించిన పిదప, చందనదాసునకు మేలొనగూడకపోవునా?" అనెను.

"అటులైనచోఁ జంద్రగుప్తునెడ ననుగ్రహించి ప్రాధాన్యశస్త్ర మంగీకరింపుఁడు" అని విష్ణుగుప్తుఁ డనెను.

అమాత్యరాక్షసుఁడు "స్వామీ! మీరు పరిగ్రహించి యుండిన శస్త్రము పట్టుట కర్హుఁడనా? యని తలపోయు చుంటిని" అని బదులుపలికెను.

అందులకు విష్ణుగుప్తుఁడు "అమాత్యా! మీ సాహస కృత్యములు మేము గనియు వినియు నున్నాము. మీరుకాక యింకెవ్వ రర్హులు?" అనెను. "నేఁటితో నందుల స్మరణ తీఱెను" అని తలఁచుకొనుచుఁ జంద్రగుప్తుఁ డిచ్చు ప్రాధాన్య శస్త్రము దీసికొని రాక్షసామాత్యుఁ డుచితాసనము నలంకరించెను. అంత విష్ణుగుప్తుఁడు రాక్షసామాత్యునిఁ జూచి "స్వామీ! మలయకేతువువిషయమై చంద్రగుప్తుఁ డెట్లు మెలఁగవలయునో యానతిండు" అనెను.

"అయ్యా, రాజకుమారా! ఈ మలయకేతువు తండ్రి మహాత్ముఁడై విష్ణుగుప్తుని వాక్యానుసారము నీ కుపకరించుటచేతను నిర్దోషి యగుటచేతను గృతజ్ఞులమైన మన సన్మానమున కర్హుఁడు" అని రాక్షసుఁడు చెప్పఁగా విని, చంద్రగుప్తుఁ డందులకు సమ్మతించి, మలయకేతువును గౌరవముతో నాస్థానమునకుఁ బిలిపించి దివ్యసింహాసనము పైఁ గూర్చుండఁబెట్టెను. అప్పు డమాత్యరాక్షసుఁడు ఇందుశర్మను జూచి "ఇందుశర్మా! అమాత్యరాక్షసుఁడను

నమస్కరించుచున్నాను" అని సాష్టాంగనమస్కార మాచరించెను.

అప్పుడిందుశర్మ, "అయ్యా! అమాత్యరాక్షసా! ఇప్పుడు మా పడినపాటులెల్ల ఫలవంతము లాయెను" అని ప్రతినమస్కారము చేసి కూర్చుండెను. అట్టియెడ విష్ణుగుప్తుఁడు, "కుమారా! ఈ కలికాలమున మిత్రోత్తముఁడగు చందనదాసునకుఁ దుల్యుఁడైన పురుషుఁడు పుట్టియుండలేదు. ఇఁక ముందును బుట్టఁడు. ఇతనివలెఁ బ్రాణములఁ దృణీకరించి మిత్రకార్యమునకై పాటుపడినవా రెవరు? అతనిని మిగుల సన్మానింపవలయు" ననఁగాఁ జంద్రగుప్తుఁ డాతనిని సగౌరవముగ సభకు రావించెను. అంత విష్ణుగుప్తుఁడు "మహాత్ముఁడవైన వణిజుఁడా! నీకు శిబిచక్రవర్తి కొనఁగూడినట్టి యాచంద్రార్కమైన కీర్తి సమకూరెను" అని యతనిని గౌరవించి కూర్చుండఁబెట్టెను. పిదప విష్ణుగుప్తుఁడు బొక్కసమునందుఁ జేర్పఁబడిన యతని వస్తువులనెల్లఁ దెప్పించి యిచ్చి, స్వర్ణాభిషేకము చేసి, ఏనుఁగుపై నతని గృహమునకుఁ బంపివేసెను.

---

## చంద్రగుప్తుని పట్టాభిషేకము

మహేంద్రునివలెఁ జంద్రగుప్తుఁడు పేరోలగం బుండెను. అప్పుడు విష్ణుగుప్తుఁడు రాక్షసామాత్యునిఁ జూచి "సచివోత్తమా! చంద్రగుప్తునకుఁ బట్టాభిషేకము నిర్వర్తింప మీరే యర్హులు; ఈయుత్సవమును జూచి సంతోషించి

తప మాచరింప నైమిశారణ్యమున కేఁగుదుము" అని తన కోరికఁ దెలిపి యచ్చోటు వాసి పర్ణశాల కేఁగెను. చంద్రగుప్తుఁ డంతఃపురమునకు పోయెను. అమాత్యరాక్షసుఁడు తగినవారిని బిలిచి "పురమెల్ల నలంకరింపుఁడు; కొద్దిపాటి నేరములవారిని చెఱలనుండి విడిపించుఁడు. దీనానాథుల కన్నవస్త్రము లొసఁగుఁడు; గంగాది సమస్తనదుల జలములు పట్టాభిషేకమునకు వలయు తక్కిన సామగ్రు లన్నియును సిద్ధము సేయుఁడు" అని యానతిచ్చి పంపెను. సామంతరాజులు కానుకలఁ బట్టించుకొని విచ్చేయవలయునని లేఖలు వ్రాయించి పంపెను.

రాజధానియగు కుసుమపురము రాజ్యలక్ష్మీ పూజామంటపము చందమున నొప్పారునట్లుగా నలంకరింపఁబడెను. ఆపుర మపుడమరావతీపురము నెకసక్కెము లాడునట్లుండెను.

చంద్రగుప్తుఁడు నిర్ణీత శుభలగ్నమునఁ దన పత్ని కనక కలశమున జలము దెచ్చి పోయఁగా విష్ణుగుప్తుని పాదములను గడిగి తజ్జలములు శిరమునఁ బ్రోక్షించుకొని, యతని పాదములకు రత్నపాదుకలు దొడిగి, యతఁడు దొడుఁగుచుండిన పాదుకలను శిరమున వహించి "ఇవే మా కులదైవతములు; వీనిని మాయం దనుగ్రహించి యొసఁగవలయును; దేవతాగృహమునం దుంచి పూజింతును" అని పలికి, చంద్రగుప్తుఁడు విష్ణుగుప్తుని యనుమతిని బొంది మంగళస్నాన మాచరించి, అలంకృతుఁడై మహాదానములు చేసి సకలజనానుమతిని సింహాసన మధిరోహించి మాణిక్యమయమయిన కిరీటము ధరించి నక్షత్ర సముదాయమున

దేదకిల్లు పూర్ణచంద్రునివలె రాజమండలమునడుమ సింహ పీఠికపైఁ జంద్రగుప్తుఁ డొప్పారుచుండఁగా బ్రాహ్మణు లాశీర్వాద మంత్రాక్షతలు చంద్రగుప్తుని శిరస్సుపైఁ జల్లిరి. పుణ్యస్త్రీలు మంగళహారతులెత్తిరి. "జయ, రాజాధిరాజ! కురుకులాబ్ధిచంద్ర! జయ చంద్రగుప్త సార్వభౌమ!" అని వందిమాగధులు కైవారములు సలిపిరి. భాగురాయణుఁడు శ్వేతాతపత్రము పట్టి నిలిచియుండెను. భద్రభటాదులు వింజామరలు వీఁచుచుండిరి. అమాత్యరాక్షసుఁడు పుష్ప ములచేఁ జంద్రగుప్తునిఁ బూజించి రత్నములకానుక లర్పించు చుండ సామంతరాజులు కప్పములు గానుకలు సమర్పింపఁ జంద్రగుప్తుఁడు పట్టాభిషిక్తుఁ డయ్యెను.

చంద్రగుప్తుఁ డెల్లరకు దివ్యభూషణవస్త్రగంధ మాల్యాదులను గర్పూర తాంబూలముల నొసఁగి సత్క రించెను. ఇవ్విధముగ సకలజన సంతోషప్రదముగఁ జంద్ర గుప్తుని పట్టాభిషేకము జరుగుటను విష్ణుగుప్తుఁడు చూచి తాను ధన్యుఁడైనటు లానందించి సకల రాజమండల సమే తుఁడైన చంద్రగుప్తునిఁ గాంచి—

"రాజాధిరాజవైన చంద్రగుప్తా! నాకంటె నధికుఁ డైన రాక్షసామాత్యుఁడు నీ శ్రేయమునుగోరు నమాత్యుఁ డయ్యెను. సకల నృపమండలము నీ పరివారమయ్యెను. నీవు సార్వభౌముఁడని యనిపించుకొంటివి. ఇఁక యశోవంతుఁ డవై వెలయుము. నేను దపమొనర్ప ఋష్యాశ్రమముల కేఁగెదను. నా గమనమున కానతిమ్ము" అనఁగాఁ జంద్ర గుప్తుఁడు కంట నీరు చిప్పిలుచుండఁగా మ్రొక్కుచు విష్ణు

గుప్తునిఁ జూచి, "మహానుభావా! విపత్సముద్రమగ్నుఁడైన నన్నుద్ధరించి రాజనిపించితిరి. మిమ్ముఁ గృతజ్ఞతతోఁ బొగడుట సూర్యునకు దీపోపచారము వంటిదగును. మీ రొసఁగ బాసిన యిమ్మహారాజ్యాధిపత్యము నాకు సంతుష్టి నొసగఁగూర్పదు. ఇటులుండియు నింకను మిమ్ము నిర్బంధింపలేను. పరిపాలనమునఁ బొరపాటు కలుగనట్లు నే నెవ్విధమున నడుచుకొనవలయునో యానతిండు" అని ప్రార్థించెను. ఆ మాటలకు విష్ణుగుప్తుఁడు—

"కుమారా! అనాదిగ జరుగుచు వచ్చుచున్న దేశ మర్యాదలకు లోపముగలుగనట్లు పరిపాలించుటే రాజ్యభార నిర్వాహమని తెలియునది. నీవు విహితముగ నడచుకొనుటను జూచి ప్రజలెల్లరు విహితమార్గముననే నడతురు. దానివలన నీ రాజ్యమందు ధర్మ మభివృద్ధిఁ జెంది బాధలు దొలఁగుటచే నీ కోశగృహములు ధనముచే నిండి యొప్పారును. ఇవ్విధముగ సమకూడిన ధనము రాజ్యతంత్రముల కుపయోగించుచు ప్రజాపరిపాలనమువలనఁ గలుగు పుణ్యము సంపాదించుము. దీనికంటెఁ బ్రభువునకు ధర్మమనునది వేఱొండు లేదు. నీ సంపదకుఁ గారణభూతులయిన ప్రజల యోగక్షేమములను నీ తనయుల యోగక్షేమములవలె భావించుచు నీయెడ వారికి భయ విశ్వాసము లొనగూడునట్లు నడచుకొనుము. అవినీతిపరులగువారికి దారతమ్యము దెలిసి దండింపుము. న్యాయ్యపక్షపాతివై, లోకాపనిందకు జడిసి నడుచుకొనుము. కార్యదక్షుల మోల, నిష్ప్రయోజకుల సన్మానింపకుము. వంచకుల మాటలను బరిగణింపకుము. ఏ కార్యమును విమర్శించి

చేయుము. నేఁడు సేయఁదగిన పనిని 'రేపు' అనకుము. నీకు గర్తవ్యమగు పనియందు భృత్యులను నియమింపకుము. ఆరంభించిన మహాకార్యమునకు ప్రయోజన మిదియని ప్రజలకుఁ జూపింపకు. పురుషస్వభావ మరయక కార్యములయందు నియమింపకుము. సాధువులకు దీనానాథులకుఁ బోషకుఁడవుకమ్ము. ఉదయించు పూర్ణశశాంకునివలె మహాభ్యుదయమొంది జనరంజకుఁడవై యలరారుము. నీవును ధనవంతులవలన నీతి దప్పక ధనమార్జించి దానివలన రిక్తులను బోషించి పౌరులు మేరమీఱి హెచ్చకుండునట్లును దగ్గిపోకుండునట్లును సమస్థితియం దుంచి ధరాపాలనము సేయుము. దేశకాలపాత్రములను దెలిసి కార్యము ప్రారంభింపుము.

ఇవ్విధమున రాజ్యభారము నిర్వహించుచుంటివేని శత్రువులు నీ పాదాక్రాంతులగుదురు. ప్రజలు పుష్టినెందలోకమునకు క్షేమమొనగూడును. నీతిఁ దప్పక, స్త్రీ మద్య ద్యూతాదులకు వశుఁడవుగాక పాలించినచో నీ చిత్తస్థైర్యమువలెనే నీ రాజ్యలక్ష్మియును స్థిరతఁ జెందును. ఈ యర్థము దండనీతిజ్ఞుల యభిమతము. దీనివలనఁ బురుషార్థములు సిద్ధించును. ఈ నీతిని బఠించువాఁడు మేధావంతుఁడగును. మంత్రిపద మవలంబించు వారికీ నీతి దెలియుట యావశ్యకము. ఇది నీతిశాస్త్రమగుటచేతఁ బ్రీతిపాత్రుఁడవైన నీకుపదేశించితిని" అనెను. ఆ మాటలకుఁ జంద్రగుప్తుఁడు "మహాత్మా! మీరుపదేశించిన నీతిరహస్యముచే నంధునకు దృష్టి యొనఁగూడినట్లు నా హృదయమున విజ్ఞానజ్యోతి వెలిగినది. ఆనతిచొప్పున నడచుకొనెద" నని యతనియొద్ద

నుండి కదలక కన్నుల నీరువెట్టుకొని మిన్నకుండెను. అది గాంచి విష్ణుగుప్తుఁడు—

"కుమారా! ఏల చింతిల్లెదవు? ఇఁక మా తపోవన గమనమున కనుకూలుఁడవు కమ్ము. ఇఁక నీ వమాత్య రాక్షసు ననుమతిచొప్పున నడుచుకొనుచు సామ్రాజ్యసుఖము లనుభవింపుము" అని దీవించి వెడలునప్పు డమాత్య రాక్షసుఁడు శిష్యసమేతుఁడైన యిందుశర్మకు నపరిమిత ధనము నొసఁగెను. అప్పుడు మలయకేతు ప్రభృతులైన మండలాధిపతులెల్లరు నమస్కరించి వినుతించుచుండఁగా విష్ణుగుప్తుఁడు వారి కుపచారోక్తులు పల్కుచుఁ 'జంద్రగుప్తున కిష్టులై మెలఁగుఁడు' అని బోధించెను. పిదప రాక్షసుఁడును చంద్రగుప్తుఁడును రథములెక్కి తమ వెంబడి వచ్చుచున్న వారిని నిలువుఁడని చెప్పి విష్ణుగుప్తాదులను నైమిశారణ్యముఁ జేర్చిరి. తదుపరి చంద్రగుప్త రాక్షసామాత్యులు విష్ణుగుప్తుని యాశీర్వచనములఁ బొంది పాటలీపురమునకు మరలి వచ్చిరి. చంద్రగుప్త సార్వభౌముఁడు పృథ్వీసామ్రాజ్యముఁ బరిపాలించుచుండ నమాత్యరాక్షసుఁ డతనినిఁ జూచి—

"కుమారా! విష్ణుగుప్తుఁడు చేసిన మహోపకారమునకు మనమెట్టి ప్రత్యుపకారము చేయగలము? నీ యానతియైనచో నతఁడు విశ్రమించియుండిన పర్ణశాలాస్థలమున విష్ణ్వాలయ మొక్కటి నిర్మించి యందు శ్రీ వేంకటాచలపతిని ప్రతిష్ఠించి యా దేవుని సన్నిధానమందు నార్య విష్ణుగుప్తుని విగ్రహము స్థాపించి నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవాదులు జరుగుటకు సర్వమాన్యము లొసఁగి యతఁడు

కూర్చుండిన స్థలములయం దెల్ల నన్నసత్రములు గట్టించి యతఁడు సంచరించిన ప్రదేశములయం దగ్రహార తటాకా రామముల నిర్మించి నైమిశారణ్య మార్గము పొడుగునను జెట్లు, సాలలు, సరోవర పుష్పవాటికలు మున్నగువానిని వేయింపవలయును" అనెను. అందులకు చంద్రగుప్తుఁడు—

"స్వామీ, యజమానుఁడ! నా పితామహుఁడైన సర్వార్థసిద్ధియు నా తండ్రియైన మౌర్యుఁడును నా యాచార్యవర్యులైన విష్ణుగుప్తులును, మీరే యగుటచే నేఁడు మొదలుకొని యే కార్యమెట్లు జరుపవలయునో యా కార్య మా రీతిగ మీరే జరుపునది" యని చెప్పఁగా నమాత్యరాక్షసుఁడు సంతసిల్లి యాపనుల నిర్వహించుటకుఁ దగినయధికారుల నియమించెను. పిదప చంద్రగుప్త సమేతుఁడై మలయకేతువున్న భవనమునకు వచ్చి యమూల్య వస్త్రాభరణములచే నా రాజకుమారు నలంకరించి, "ఈ యుభయ రాజ్యములు మీవి; మీ రిటకు విచ్చేయుటచే డమ నగరములోఁ బౌరు లెల్లరుఁ జింతిల్లుచుందురు. అనుగ్రహముంచి నిజనివాసమునకు దయసేయవచ్చును" అని యుపచారోక్తులు పలికి భద్రభటాది సైనికులను తోడొసఁగి పంపివేసెను. అమాత్యరాక్షసుఁడు రాజ్యతంత్రమంతయుఁ దానే వహించి తొంటికంటె నధికముగ శ్రద్ధవహించి పాలించుటచేఁ జంద్రగుప్త మహారాజు సంతుష్టుఁడై సామ్రాజ్యపదవి ననుభవించుచుండెను.

---

Printed by Kokila Press, Nellore

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | AA/02B168 | Date | 27-9-21 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | C.I, 129 | | |
| Missing Pages | No | | |
| Prepared | Sireesha | Scanned | K. Yameena |
| BOOK SIZE | H 7.2 W 4.9 | Pages | 134 |

